# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక" — ఫెవీ ఫెయిరీ





"ఇంద్రజాలం కావే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
తల్చూతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో చటుక్కున చెప్పు."

"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మేదైనా చేసెయ్యింక"

గులాబీ పూలు ఎలా తయారుచెయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్ పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.

గులాబీ పూలు ఎలా తయారు చేయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటంకోసం ఈ కూపన్ ను చిరునామాకు పంపించండి : "ఫెవీ ఫెయిరీ," పోస్ట్ బాక్స్ 11084 బొంబాయి 400 020.

పేరు : ____________________

వయసు : ____________________

చిరునామా : ____________________

____________________

నగరం : ____________________

రాష్ట్రం : ____________ పిన్ : ____________

## ఫెవికాల్ ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




## బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది

OBM-7954 TL

పాల బిస్కట్లు–
నవ్వుతూ, తుళ్లుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!




రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

బ్రిటానియా

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''పుణ్యకార్యం'']కు ఆధారం, ''వసుంధర'' రచన. సమాజంలో, ఏనాడూ కవులకూ, నటులకూ, గాయకులకూ ఆదరణ వున్నది. అయితే, రాజాశ్రయం వంటిది, వారిలో అత్యంత సమర్థులైనవారికి మాత్రమే లభించేది. కాని, అందుకు వాళ్ళు ఎన్నో ఆటంకాలను అధిగమించవలసివచ్చేది. ''కవిసన్మానం'' అన్న కథలో, ఈ విషయం చక్కగా వివరించబడింది.

## అమరవాణి

ఆమరణాంతాః ప్రణయాః, కోపాస్తత్ క్షణభంగురాః
పరిత్యాగశ్చ నిస్సంగా, భవంతి హి మహాత్మనామ్.

[గొప్పవాళ్ళ ప్రేమ జీవితాంతం ఉంటుంది; కోపం క్షణంలో పోతుంది. మహాత్ములు ప్రతిఫలాపేక్ష లేకుండా త్యాగం చేస్తారు.]

సంపుటి 79 సెప్టెంబర్ '86 సంచిక 3

విడి ప్రతి : 2-50 :: సంవత్సర చందా : 30-00








రారెవ్వరూ నాకు జ్వరమని
వేరెవ్వరు నాకింక తోడని
ఆలోచించా నేనేదో చెయ్యాలని
ఇంట్లో అందరి సరదాతీర్చాలని
ఇవిగో పెన్నులు, అదిగో కాగితం
ఎకో రంగులలోనే నాకింక స్నేహం.
గీసేస్తా గీతలలోనే ఓ బొమ్మ
మురిసిపోయి ముద్దివ్వాలి మా అమ్మ
ఎకో పచ్చ,ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగులమయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ,గోధుమలతో అయ్యేనది ఓసెట్




**ఎకో**
**స్కెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!**

400 057. ఫోన్ : 6040305,6043556.




# మిఠాయిల మహారాజు
## వెన్న రుచిని ఎప్పటికన్నా మిన్నగా చేశాడు







# ట్రై-మీ



ట్రై-మీ వెన్న అందించే కమ్మని నోరూరించే రుచితో సరికొత్త, మెత్తని మిఠాయి....మీకు ఎంతో ఇష్టమైనవారిని మెప్పించాలనుకున్నప్పుడు సరిగ్గా సరిపోయే మిఠాయి

నోరూరించే రకరకాల ప్యారీస్ మిఠాయిలు:

కారమిల్స్ • ట్రై-మీ
చాకొలెట్ ఎక్లెయిర్స్
కోకోనట్ పంచ్
చాక్లెయిర్స్ • కోకోనట్ క్రీమ్
లాలీపాప్స్ • గోల్డెన్ బాన్ బాన్




70 సంవత్సరాలకుపైగా
మిఠాయిలలో
మొట్టమొదటి పేరు

PCL 1829

# కల్యాణుడు

ఒకప్పుడు ఋషులు కొందరు చేరి, దీక్షతో యజ్ఞం చేసి, స్వర్గవాసానికి తగిన అర్హతను సంపాదించారు. కాని, వారికి స్వర్గానికి వెళ్ళే మార్గం తెలియలేదు. ఈ ఋషులలో కల్యాణు డనే ఋషి, జ్ఞానంలోనూ, దీక్షలోనూ అందరికన్నా గొప్పవాడుగా పేరొందాడు. ఆ కారణంగా, మిగతా ఋషులు అతణ్ణి, "మనమందరమూ స్వర్గానికి చేరేమార్గం నువ్వే చూపాలి," అని ప్రార్థించారు.

కల్యాణుడు స్వర్గమార్గాన్ని అన్వేషిస్తూ బయలుదేరాడు. అరణ్యంలో కొంతదూరం వెళ్ళాక. ఆయనకు ఊర్ణయు డనే గంధర్వుడు ఎదురయ్యాడు. కల్యాణుడు తమ సమస్యను గంధర్వుడికి తెలియజేశాడు. గంధర్వుడు అతడి మీద దయతలచి, ఒక మంత్రం ఉపదేశించాడు. స్వర్గవాసానికి అర్హులయిన వారు, ఆ మంత్రాన్ని జపించినట్టయితే, వారి ముందు స్వర్గద్వారాలు తెరుచుకుంటాయి!

కల్యాణుడు సంతోషంగా ఋషులవద్దకు తిరిగి వచ్చి, వారికి ఆ మంత్రం ఉపదేశించాడు. ఆ మంత్రాన్ని ఎవరి నుంచి నేర్చావని ఋషులు అతణ్ణి అడిగారు. కల్యాణుడు సమాధానం చెప్పకుండా మౌనం వహించాడు. ఆయనే, తపస్సు చేసి ఆ మంత్రాన్ని సాధించి ఉంటాడని ఋషులు భావించారు.

కల్యాణుడు దారి చూపగా, ఋషులు మంత్రం జపిస్తూ స్వర్గద్వారం సమీపించారు. స్వర్గద్వారాలు తెరుచుకున్నాయి. కల్యాణుడికి తప్పతక్కినవారందరికీ స్వర్గప్రవేశం లభించింది. మరుక్షణమే స్వర్గం తలుపులు మూసుకున్నాయి.

తనకు మేలు చేసిన గంధర్వుడి పేరు కూడా చెప్పకుండా, ఆయనపట్ల చూపవలసిన కృతజ్ఞత చూపకపోవడం వల్లే కల్యాణుడికి అర్హత ఉన్నప్పటికీ స్వర్గప్రాప్తి దూరమయింది!





# రాజలక్షణం

భద్రావతీ రాజ్యాన్ని పాలించే విక్రమసేనుడికి, విజయుడూ, అనంతుడూ అనే ఇద్దరు కుమారులు. వాళ్ళు కవలలు. విక్రమసేనుడు బలపరాక్రమవంతుడే కాక, మంచి పరిపాలనాదక్షుడు. రాజ్యంలో ఎక్కడా అలజడులులేక, ప్రజలు సుఖశాంతులతో జీవిస్తున్నారు.

తన అనంతరం భద్రావతీ పాలకుడైనవాడు, తన పేరుప్రతిష్ఠలు నిలబెట్టగలిగినవాడుగా ఉండాలనే ఉద్దేశంతో, విక్రమసేనుడు కొడుకు లిద్దరిని క్రమశిక్షణతో పెంచడమే కాక, తగిన గురువుల ద్వారా, రాజోచితమైన అన్ని విద్యలూ నేర్పించాడు.

విజయుడు చాలా తెలివైనవాడు, విలువిద్యానిపుణుడు. సర్వశాస్త్రాలూ క్షుణ్ణంగా చదివినవాడు. ప్రవర్తనలో ఎంతో వినయం కనిపించేది. దేనికీ తొణకడం గాని, ఉద్రేకపడడం గాని, అతడి లక్షణం కాదు.

అనంతుడు ఇందుకు పూర్తిగా విరుద్ధం. అతడిలో ఎంతో చురుకుదనం కనిపించేది. అతిస్వల్ప విషయాలకు కూడా ఉద్రేకపడిపోయేవాడు. తన మాట కాదన్నవాళ్ళనూ, తన నిర్ణయాలను తప్పు పట్టినవారినీ సహించేవాడు కాదు.

విక్రమసేనుణ్ణి, భిన్నస్వభావులైన తన ఇద్దరు కొడుకుల్లో, ఎవరు సమర్థుడైన రాజ్యపాలకుడు కాగలడన్న శంక బాధిస్తూండేది. విజయుడూ, అనంతుడూ ఇరవైఏళ్ల వయసువాళ్ళు కాగానే, ఆయన వాళ్ళను ఒక సంవత్సరం పాటు, రాజ్యంలోని అన్ని ప్రాంతాలూ తిరిగి రావలసిందిగా ఆదేశించాడు.

అన్నదమ్ము లిద్దరూ, వెంట సేవకులు లేకుండా, కాలినడకను దేశంలోని

ఇంద్రగంటి జానకీబాల



పల్లెలూ, పట్టణాలూ సందర్శిస్తూ, తండ్రి పెట్టిన సంవత్సరం గడువు పూర్తయే దశలో, రాజ్య సరిహద్దుల్లో వున్న ఒకానొక అడవి ప్రాంతాన్ని చేరారు.

మిట్టమధ్యాహ్నంవేళ, వాళ్ళు అక్కడ ఒక మహావృక్షం కింద విశ్రమించి వుండగా, కొంచెం దూరం నుంచి ఒక స్త్రీ కంఠం, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టడం వినిపించింది.

విజయుడూ, అనంతుడూ వెంటనే లేచి అటుకేసి పరిగెత్తారు. చుట్టూ చిన్న చిన్న మొక్కలూ, తీగలూ వున్న కారణంగా, కనీకనిపించకుండా వున్న ఒక పాడుబడిన బావి నుంచి స్త్రీ ఆర్తనాదం వినిపిస్తున్నది.

ఇద్దరూ బావిని సమీపించి, లోపలికి తొంగి చూశారు. ఆపదలో వున్న స్త్రీ తల ఎత్తి వాళ్ళ కేసి చూస్తూ, "అయ్యా, ఈ పాడుబడిన బావిని అడవితీగలు కప్పి వుండడంతో, చూడక ఇందులో పడిపోయాను, దయతలచి నన్ను రక్షించండి!" అన్నది.

విజయుడు ఆమె అద్భుతసౌందర్యానికి ముగ్ధుడయ్యాడు. అతడు తల తిప్పి తమ్ముడి కేసి చూసేసరికి, అతడు వెంటనే అక్కడ వున్న కొన్ని అడవితీగలను కత్తితో నరికి ఒకదానికొకటి ముడివేసి, ఒక కొసను అన్నకు ఇచ్చాడు. రెండవ కొస పట్టుకుని కొంత దూరం బావిలోకి దిగి, అక్కడ వున్న స్త్రీకి చేయి అందించి, బయటికి తీసుకువచ్చాడు.

విజయుడామెను, "ఎవరు మీరు? ఒంటరిగా ఇక్కడి కెందుకొచ్చారు?" అని అడిగాడు.

అందుకామె, "నేను కరవీరపుర రాజకుమార్తెను. నా పేరు పల్లవి. నా చెలికత్తెలతో కలిసి, అడవికి విహారాని కొచ్చాను. ఇక్కడ వారితో దాగుడుమూతలు ఆడుతూ, వారి నుంచి దూరమై, కాలుజారి యీ బావిలో పడ్డాను. నా చెలికత్తెలు నన్ను వెతుకుతూ ఇక్కడికి రాకమానరు," అన్నది.



పల్లవి మాట ముగించేలోపలే, బిలబిల మంటూ ఆమె చెలికత్తెలు అక్కడికి వచ్చారు.

అప్పుడు విజయుడూ, అనంతుడూ తామెవరైందీ రాజకుమార్తెకు చెప్పారు. విజయుడికి మనసులో ఆమెను వివాహ మాడాలన్న కాంక్ష కలిగింది. అనంతుడికి కూడా అలాంటి భావమే కలిగి, తానామెకు చేయి అందించి రక్షించాడు కనక, తనను వివాహమాడడమే ధర్మం అనుకున్నాడు.

ఆ వెంటనే అతడు, పల్లవికి తన మనసులోని మాట చెప్పేశాడు. విజయుడు మాత్రం మౌనంగా పూరుకున్నాడు. పల్లవి ఒకసారి కళ్ళెత్తి అతడి కేసి చూసి, చెలికత్తెలతో కలిసి వెళ్ళిపోయింది.

గడువు ముగిసి రాజధానికి తిరిగి వస్తూనే, విజయుడూ, అనంతుడూ తండ్రికి దేశాటనలో తమకు కలిగిన అనుభవాల గురించి చెప్పి, రాజకుమారి పల్లవిపట్ల తమ మనసులోని కోర్కెను వెల్లడించారు.

ఇది విని విక్రమసేనుడు ఆశ్చర్యపడి కొడుకులతో, "కరవీరరాజకుమారి, మీ ఇద్దరిలో ఎవరినైనా వరించిందో, అసలు వరించనేలేదో తెలియడం లేదు. ఆ రాజ్యం ఎంతో కాలంగా మన మిత్రరాజ్యం. రాజునూ, రాకుమారినీ ఇక్కడికి ఆహ్వా నించి, సంగతి సందర్భాలు తెలుసు కుంటాను," అన్నాడు.

భద్రావతీ రాజ్యమంత్రి, కరవీరపురం వెళ్ళి, తమ రాజు కోర్కెగా చెప్పి, పల్లవినీ, ఆమె తండ్రినీ తీసుకు వచ్చాడు.

విజయుడూ, అనంతుడితోపాటు, ఇద్దరు రాజుల సమక్షంలో మంత్రి పల్లవికి, రాజకుమారుల కోర్కె గురించి చెప్పి, "అమ్మా, పల్లవీ! మా మహారాజు గారి కుమారుల్లో ఎవరినైనా నువ్వు వరించడం జరిగిందా?" అని అడిగాడు.

పల్లవి అవునన్నట్టు తల వూపింది. వెంటనే మంత్రి ఆమె చేతి కొక పూల మాల యిచ్చాడు.

అది చూస్తూనే అనంతుడు చిరునవ్వుతో, "మహామంత్రీ! రాకుమారి, మా ఇద్దరిలో ఎవరిని వరించిందన్న సంశయం, మీకు కలగవలసింది కాదు. నేనామెను ప్రాణాపాయం నుంచి కాపాడాను; మరి నన్ను కాక మరెవరిని వరిస్తుంది!" అన్నాడు.

పల్లవి తల వంచుకుని చిరునవ్వుతో ముందుకు వచ్చి, పూలమాలను విజయుడి మెడలో వేసింది.

విజయుడు చిన్నగా నవ్వి వూరుకున్నాడు. పల్లవి తల ఎత్తి సూటిగా అనంతుడి ముఖం కేసి చూస్తూ, "మీ అన్నగారి కనుసన్నలలో మెసిలే నీవు, ఆయన ఆదేశించగా నన్ను పాడుబడిన బావి నుంచి కాపాడావు. నీ చేష్టలలో నాకు, సీతాదేవి రక్షణపట్ల లక్ష్మణుడు చూపిన భక్తి కనిపించింది కాని, మరొక భావం తోచలేదు. నిండుగా రాజసం ఉట్టిపడే మీ అన్నగారు, నా మనసు గెలుచుకున్నారు," అన్నది.

అనంతుడు ఒక క్షణకాలం తల వంచుకుని, తర్వాత తల ఎత్తి పల్లవి కేసి చూస్తూ, "వదినా, నువ్వు సీతా—లక్ష్మణుల ప్రసక్తి తెచ్చి, నాలో పేరుకుపోయిన అహంభావానికీ, దురుసుతనానికీ తిరుగులేని చికిత్స చేశావు. అన్నది సహజమైన రాజఠీవి; నాది కృత్రిమమే కాక, ఎరువు తెచ్చుకున్న రాజసం. ఈ వాస్తవం తెలియజెప్పినందుకు చాలా కృతజ్ఞుణ్ణి!" అంటూ నమస్కరించాడు.

ఇదంతా గమనిస్తున్న విక్రమసేనుడికి, ఒక సత్యం తెలిసివచ్చింది. రాజు మేధాసంపత్తి కలిగి, శౌర్యవంతుడు కావడం ఎంత ముఖ్యమో—కోపం, వాగాడంబరం లేకుండా, తన పరివారం చేత పనులు సక్రమంగా జరిపించడం కూడా అంత ముఖ్యం. ఈ లక్షణం, తన పెద్దకుమారుడైన విజయుడిలో వున్నది!

విక్రమసేనుడు కొద్ది రోజుల తర్వాత, విజయుడి పట్టాభిషేకం, పల్లవితో వివాహం వైభవంగా జరిపించాడు.





# కొత్త న్యాయాధికారి

పూర్వం వింధ్యారణ్య ప్రాంతాల్లోని, వ్యవసాయ యోగ్యమైన భూములన్నీ, కొంత మంది భూస్వాముల హక్కు భుక్తాల్లో వుండేవి. వాళ్ళు రాజుకు ఏటా కొంత ధనాన్ని కప్పంగా చెల్లిస్తూ, తమ అధీనంలో వున్న ప్రజలపై సర్వాధికారాలూ చెలాయిస్తూండేవాళ్ళు.

ఈ భూస్వాముల సేవలో కొద్దిమంది సైనికులుండేవారు. వాళ్ళకు భూస్వామే సేనానాయకుడు. అలాగే తనకు, తానే మంత్రి. విద్యాగంధం లేకపోయినా, భూస్వాములు ప్రజలందరికీ తామే గురువులూ, ధర్మబోధకులూ అన్నట్టు ప్రవర్తించేవాళ్ళు.

నాగచూడామణి అనే ఆయన, అలాంటి భూస్వాముల్లో ఒకడు. ఒకసారి, ఆయన ఉన్న ఊరిలో న్యాయాధికారిగా చాలాకాలం పని చేసినవాడు చనిపోవడం జరిగింది. వెంటనే నాగచూడామణికి, తను న్యాయాధికారిగా వ్యవహరించాలన్న బుద్ధిపుట్టి, తనే కొత్తన్యాయాధికారినంటూ చాటింపు వేయించాడు.

అయితే, నేరస్థులకు పెద్ద, పెద్ద శిక్షలూ, మరణదండన లాంటివి కూడా విధించగల న్యాయాధికారి స్థానాన్ని, రాజు అమోదించాలన్న నియమం వుండేది.

నాగచూడామణి తను న్యాయాధికారినని ప్రకటించుకున్న సమయంలో, రాజు దేశ పర్యటన చేస్తూ, ఆయన వున్న ఊరుకు వచ్చాడు. భూస్వామి అప్పుడు ఒక నేర విచారణ చేస్తున్నాడు. ఇరుగు పొరుగు గ్రామస్థులైన ఇద్దరు, ఆయన ముందు నిలబడి వున్నారు. వాళ్ళల్లో ఒకడికి, ఎవరో కోసినట్టుగా ముక్కు సగం తెగిపోయి వున్నది.

కోటంరాజు రమాపతి



రాజు తన పక్కన ఉన్నతాసనం మీద కూర్చుని వుండడంతో, నాగచూడామణి యిబ్బంది పడిపోతున్నట్టు, దిక్కులు చూస్తూ, గ్రామస్థుణ్ణి, "నీ ముక్కుకు ఏం ప్రమాదం జరిగింది?" అని అడిగాడు.

వాడు పక్కన వున్న వాణ్ణి చూపుతూ, "అయ్యా. వీడు నా ముక్కు కొరికేశాడు!" అని జవాబు చెప్పాడు.

"నువ్వెందుకు కాపని చేశావు?" అని అడిగాడు కొత్తగా న్యాయాధికారి అయిన నాగచూడామణి రెండవవాణ్ణి.

వాడు, "అయ్యా, అది నా పని కాదు. అతనే తన ముక్కు కొరికేసుకున్నాడు," అన్నాడు.

"అది ఎలా సాధ్యం? ఎవడైనా తన నోటితో, తన ముక్కు పట్టుకోగలడా?" అని ప్రశ్నించాడు నాగచూడామణి.

దానికి రెండవవాడు, "సాధారణంగా అది సాధ్యమయ్యే పని కాదు. కాని ఇతను, ఒక ముక్కాలి పీట మీద నిల బడి, అది సాధించాడు," అన్నాడు.

నాగచూడామణి, పక్కనే కూర్చుని అంతా వింటున్న రాజు కేసి చూశాడు. కాలం వృథా కాకుండా, తొందరగా న్యాయ నిర్ణయం చేయాలనుకుని నాగచూడా మణి, "అవునవును, ఇతనలాగే చేసి వుంటాడు. వీడికి, నా ముందు అబద్ధా లాడినందుకు నలభై కొరడా దెబ్బల శిక్ష విధిస్తున్నాను," అని, రాజుతో, "భోజనం వేళ అయింది, దయచేయండి!" అంటూ భోజనశాలకు దారితీశాడు.

భోజనాలయాక నాగచూడామణి భార్యను, "నా తీర్పులో ఏమైనా పొర బాటు జరిగిందా?" అని అడిగాడు.

ఆయన భార్య విసుక్కుంటూ కోపంగా, "నువ్వు పరమ మూర్ఖుడిలా ప్రవర్తిం చావు. ఇదుగో ఈ ముక్కాలి పీట మీద నిలబడి, నీ ముక్కు కొరుక్కునే ప్రయత్నం చెయ్యి," అన్నది.

నాగచూడామణి అలా ప్రయత్నించి, సాధ్యం కాక, "ఇప్పుడు నేనేం చేయాలి?

రాజుగారు నా తెలివితేటల గురించి ఏమనుకుంటాడు?'' అన్నాడు విచారంగా.

''తిరిగి మరొకసారి న్యాయ విచారణ ప్రారంభించు. ఈసారి ఆ రెండో గ్రామస్థుడికి, కొరడా దెబ్బల శిక్ష విధించు.'' అని భార్య సలహా ఇచ్చింది.

రాజుగారి అనుమతితో, ఆ సాయంకాలం భూస్వామి మరొకసారి నేర విచారణ మొదలు పెట్టాడు. కాని, జరిగిందేమంటే, ఈ మధ్య కాలంలోనే మొదటి గ్రామస్థుడు నలభై కొరడా దెబ్బలూ తిన్నాడు.

ఆయన తన తీర్పును మార్పు చేస్తూ, రెండవ గ్రామస్థుణ్ణి తగిన విధంగా శిక్షించాలనుకున్నాడు. అయితే, ఆయన భార్య ఎదురుగా వున్న తెర చాటున నిలబడి, తన భర్త మరొకసారి పొరబాటు చెయ్యకుండా చూడాలన్న ఆత్రంలో, భర్తకు నాలుగువేళ్ళు చూపింది. ఆమె ఉద్దేశం నలభై కొరడా దెబ్బల శిక్ష విధించమని. అది గమనించిన భూస్వామి, నౌకరుతో, ''వీడికి నాలుగు కొరడా దెబ్బల శిక్ష విధించాను,'' అన్నాడు.

ఆయన భార్య, భర్త తిరిగి పరమ మూర్ఖుడిలా ప్రవర్తిస్తున్నాడన్న కోపంతో గట్టిగా పళ్ళు కొరికింది. అది చూసి, భూస్వామి, నౌకరుతో, ''కొరడా దెబ్బలు కాదు—వీడి ముక్కు కొరికి వెయ్యి!'' అన్నాడు.

భూస్వామి భార్యకు మతిపోయినట్టయింది. ఆమె, ఆ శిక్షను ఆపమన్నట్టుగా చేతులు వూపింది. భూస్వామి, తన భార్యే వాడి ముక్కు కొరకదలచిందని భావించి, నౌకరుతో, ''ఒరే, ఆగు! నా భార్యే వాడి ముక్కు కొరికేస్తుంది,'' అన్నాడు.

రాజు, ఇది విని పొట్ట చెక్కలయ్యేలా నవ్వాడు. తర్వాత ఆయన అక్కడి నుంచి బయలుదేరి పోతూ, ''నువ్వు న్యాయాధికారిగా కన్న, నా కొలువులో విదూషకుడిగా బాగా రాణించగలవు. ఇక్కడ న్యాయాధికారి పదవికి మరొకరిని పంపుతాను,'' అని చెప్పాడు.



# తలవ్రాత

భూషయ్య అనే చిన్న రైతుకు, జ్యోతిష్యంలో ఏ మాత్రం నమ్మకం లేదు. ఐతే, అతడి భార్య పూర్ణమ్మకు మాత్రం, జ్యోతిష్యం అంటే వల్లమాలిన అభిమానం.

వయస్సు మళ్ళిన తన కూతురుకు, ఎన్ని ప్రయత్నాలు చేసినా వివాహ ఘడియలు రాక పోవడం, పూర్ణమ్మకు మనోవేదనగా వున్నది. పక్క ఊరిలో ఒక గొప్ప జ్యోతిష్కుడున్నాడని తెలిసి, ఆమె భర్తతో, "ఆ జ్యోతిష్కుడి దగ్గరకు పోయి, మన అమ్మాయి వివాహం ఎప్పుడు జరుగుతుందో తెలుసుకుందాం," అన్నది.

భూషయ్యకు ఇది ఇష్టం లేకపోయినా, భార్య పోరు భరించవలసి వస్తుందని బయలు దేరాడు.

వాళ్ళు జ్యోతిష్కుడి ఇల్లు చేరేసరికి, అక్కడ ఒక అమ్మాయి తలుపుతెరిచి, "మా నాన్న గారి కోసమేనా? రండి!" అంటూ ఆహ్వానించింది.

భూషయ్య జ్యోతిష్కుడికి నమస్కరించి, "అయ్యా, మరేం అనుకోకండి! తమ కుమార్తెకు, పెళ్ళీడు దాటిపోతున్నట్టు కనిపిస్తున్నది. ఇంకా వివాహం జరిపించారు కాదేం?" అని అడిగాడు.

అందుకు జ్యోతిష్కుడు చేతులు జోడించి, "అంతా తలవ్రాత! ఆ భగవంతుడు, దానికి వివాహ ఘడియలు ఎప్పుడు వ్రాసి పెట్టాడో, అప్పుడు జరుగుతుంది," అన్నాడు.

ఆ జవాబు వింటూనే, పూర్ణమ్మ చప్పున వెనుదిరిగి బయలుదేరింది. భూషయ్య ఆమె ననుసరించి నడిచాడు.

—అరుపల్లి గోవిందరాజులు






## 5

[చిత్రసేనుడికీ, అతడి పరివారానికీ ఉగ్రాక్షుడు విందు చేశాడు. ఆసమయంలో, జ్వాలా ద్వీపం నుంచి భయంకర పక్షులపై వచ్చినవాళ్ళను గురించిన వర్తమానం అందింది. ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ అడవిలోకి వెళ్ళారు. అక్కడ జ్వాలాద్వీప వాసులతో జరిగిన పోరాటంలో కొందరు రాక్షసులు చచ్చారు. ఉగ్రాక్షుడు బాగా గాయపడ్డాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు తన సేవకుల భుజాలు ఆసరాగా పట్టుకుని నిలబడి, గాయాల బాధతో గట్టిగా ఓసారి మూలిగి, "చిత్రసేనా! ఎంతవాడికి ఎంత పతనం తటస్థించింది. అన్ని వైపులా కనుచూపు ఆనినంత వరకూ వున్న ఈ మహారణ్యానికి నేను ఏకైక ప్రభువును. అంతే కాక, రాక్షస జాతిలో ఎంతో కీర్తి ప్రతిష్ఠలున్న గొప్ప వంశంలో పుట్టినవాణ్ణి. అలాంటి నేను, నా అరణ్యం మధ్యనే పరదేశాల నుంచి వచ్చిన క్షుద్ర మానవులవల్ల చావు దెబ్బలు తినవలసి వచ్చింది!" అంటూ వాపోయాడు.

చిత్రసేనుడు రాక్షసుణ్ణి ఓదార్చే ధోరణిలో, "ఉగ్రాక్షా, విచారించి లాభం లేదు. నువ్వూ, నేనూ కూడా ఓటమి పొందింది జ్వాలాద్వీపాన్నుంచి వచ్చిన మానవులవల్ల కాదు, వాళ్ళు ఎక్కివచ్చిన




భయంకర పక్షులు మనను దెబ్బ తీసినై. వాటిని ప్రస్తుతం మన దగ్గిరున్న ఆయుధాలతో ఎదుర్కోవటం వల్ల, ప్రయోజనం లేదు. వాటిని చంపేందుకు మరేదైనా ఇతర మార్గం ఆలోచించాలి,'' అన్నాడు.

''అవును, ఆ మార్గం ఏదో మనం తెలుసుకునే లోపలే, ఆ క్రూరులు మనల్ని హతం చేస్తారు. నీ అపూర్వ భవనం, నా కోటా, ఈ అడవి రాజ్యం— అంతా వాళ్ళ హస్తగతం అవుతుంది,'' అన్నాడు ఉగ్రాక్షుడు నిరాశగా.

అంత భయంకర రూపుడూ, బలశాలీ అయిన రాక్షసుడు, పిరికి పాలెక్కువ వున్న మామూలు మనిషిలా జావకారి పోవటం చూసి, చిత్రసేనుడికి ఎంతో జాలి కలిగింది.

''జ్వాలాద్వీపవాసులు మన రాజ్యం ఆక్రమించుకోవటానికి ప్రయత్నిస్తున్నారని నీ అనుమానమా, ఉగ్రాక్షా!'' అని అడిగాడు చిత్రసేనుడు.

''కాకపోతే, ఈ దాడులన్నీ ఎందుకోసం?'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''అదే నాకూ అంతుబట్టటం లేదు. కేవలం మన పల్లెల్లో నుంచి అక్కడొకణ్ణీ ఇక్కడొకణ్ణీ ఎత్తుకుపోయేందుకే వాళ్ళు వస్తున్నారని నేనూ నమ్మను,'' అన్నాడు చిత్రసేనుడు.

''ఆ క్రూరుల్లో మరొక్కడు ప్రాణాలతో దొరికితే నిజం బయట పెట్టిద్దును. దొరికిన ఒక్కగానొక్క వెధవా, రహస్యం బయట పెట్టకుండానే చచ్చి వూరుకున్నాడు,'' అంటూ ఉగ్రాక్షుడు పళ్ళుకొరికాడు.

''ఏదో ఒకనాడు ఆ దుర్మార్గుల్లో కొందరు మనకు దొరక్కపోరు. అలా దొరికిననాడు, వాళ్ళను చిత్రహింసకు గురిచేసి అయినా, అసలు రహస్యం బయటపెట్టించి తీరుతాం. అసలు ఈ జ్వాలాద్వీపం ఎక్కడ? ఈ భయంకర పక్షులు వాళ్ళ స్వాధీనంలోకి ఎలా వచ్చినై? వాటి మీద సవారీ చేస్తూ, వీళ్ళు మన రాజ్యంలో మనుషుల్ని అపహరించటంలో

వున్న రహస్యం ఏమిటి ? ఇవన్నీ ముందు మనం తెలుసుకోవాలి. సరే, నేను వెళతాను. గాయాలు మానేవరకూ విశ్రాంతి తీసుకో. కోట రక్షణలు మరికొంత బలపరచటం మంచిది. నేనూ తగు జాగ్రత్తలో వుంటాను,'' అంటూ చిత్రసేనుడు తన అనుచరులతో బయలుదేరాడు.




''చిత్రసేనా, నేనింత దీనావస్థలో వున్నానని, మరెవరితోనూ అనకు. నీ పౌరుల దృష్టిలో నేను మనిషికంటే కూడా హీనుణ్ణయిపోతాను,'' అంటూ ఉగ్రాక్షుడు వెనక నుంచి పెద్దగా కేకపెట్టాడు.

ఉగ్రాక్షుడి మాటలు చిత్రసేనుడికి నవ్వు తెప్పించినై. అంతలో సేనానాయకుడు, ''మహారాజా!'' అంటూ ముందుకు వచ్చాడు.

''ఏమిటి సేనానీ ?'' అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

''ఆ ద్వీపవాసుల్ని ఎదుర్కోవటానికి మనకు తోడుగా, ఈ ఉగ్రాక్షుడి అనుచరులు కూడా వుండటం బావుంటుంది. ఏనాడు వాళ్ళు పెద్ద బలగంతో మన నగరం మీద దాడి చేస్తారో!'' అన్నాడు సేనాని.

సేనాని మాటలు చిత్రసేనుడికి కోపం తెప్పించినై. అయినా అతడు దాన్ని బయటికి కనబడనీయకుండా, ''మన నగర రక్షణకు, ఈ రాక్షసి మూకను తోడు తెచ్చుకుందామనేనా నీ వనేది? అదెన్నటికీ కుదరదు. నా భవనాన్నీ, నగరాన్నీ నా శక్తితో రక్షించుకోలేక, రాక్షసుల్ని కాపుంచుకోవలసిన పరిస్థితి వచ్చిననాడు, నేను రాజ్యత్యాగమే చేస్తాను,'' అన్నాడు చిత్రసేనుడు.

ఈ జవాబుతో సేనాని కుక్కిన పేనులా అయిపోయాడు.

చిత్రసేనుడూ, పరివారమూ అడవిలో మరి కొంత దూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా వెనక నుంచి కేకలు వినిపించినై. చిత్రసేనుడు ఆశ్చర్యపడుతూ వెనుదిరిగి



చూశాడు. వికృతమైన ఆయుధాలు చేబూనిన ఇద్దరు రాక్షసులు గుండె లవిశేలా పరుగెత్తి వస్తూ, "రాజా, రాజా, ఆగు!" అంటూ కేకలు పెడుతున్నారు.

చిత్రసేనుడు ఆగాడు. సేనాని, "మహా రాజా! ఆ జ్వాలాద్వీపవాసులు మళ్ళీ దాడికి రాలేదుగదా?" అన్నాడు.

చిత్రసేనుడు తూర్పుదిక్కు కేసి చూస్తూ, "సూర్యోదయం కాబోతున్నది. పగటివేళల్లో వాళ్ళు ఇంతవరకూ ఎవరి కంటా పడలేదు," అన్నాడు. ఇంతలో రాక్షస భటులిద్దరూ రొప్పుతూ అతణ్ణి సమీపించి, "రాజా, ఉగ్రాక్షనాయకుడు మిమ్మల్ని వున్నపళంగా తీసుకురమ్మన్నాడు. ఆయన కుంభికుప్ప దగ్గిర వున్నాడు," అన్నారు.

"అంత అవసరం అయిన పనేమిటి?" అన్నాడు చిత్రసేనుడు.

"భయంకర పక్షుల మీద ఎక్కి వచ్చేవాడొకడు దొరికాడు. అందుకని, మా నాయకుడు మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నాడు," అన్నారు రాక్షసులు.

"ఆ మాత్రానికి మీరు గుండెలు బద్దలు కొట్టుకుంటూ పరిగెత్తుకు రావాలా? దొరికినవాడు ఎక్కడికి పోతాడు!" అంటూ చిత్రసేనుడు రాక్షసులతో బయలుదేరాడు.

"వాడు చెట్టు దిగి రానంటున్నాడు, రాజా! మీరు వస్తేగాని పని సానుకూలం కాదు," అన్నాడొక రాక్షసుడు.

ఈ రాక్షస భటు లిద్దరూ ఏదో మద్యం తాగిన తిక్కలో వున్నారని చిత్రసేనుడు భావించాడు. శత్రువు ఒకసారి ఒంటరిగా చిక్కిం తరవాత, చెట్టు దిగి రావటం, దిగి రాకపోవటం వాడి చేతుల్లో వున్న పని కాదు.

అరగంట తరవాత చిత్రసేనుడు తన అనుచరులతో కుంభికుప్ప గ్రామాన్ని సమీపించేసరికి, ఊరి బయట ఒక మహా వృక్షం చుట్టూ కొందరు రాక్షసులూ, గ్రామవాసులూ కనిపించారు. వారందరి మధ్యా ఉగ్రాక్షుడు నిలబడి వున్నాడు.

అందరి దృష్టి చెట్టు మీదనే లగ్నమయి వుంది. ఆ చెట్టు చిటారుకొమ్మల్లో పులి చర్మం ధరించి వున్న ఒకడు కత్తి ఝళి పిస్తూ గావుకేకలు పెడుతున్నాడు.

"నేను రాను, దిగి రాను. కోరి మీ రాక్షసులకి ఫలహారం నే నెందుకవు తాను? ఎవడైనా చెట్టెక్కి వచ్చాడో, వాణ్ణి కత్తితో పొడిచి, నేను పొడుచుకు చస్తాను!" అంటున్నాడు వాడు.

చిత్రసేనుడు, ఉగ్రాక్షుణ్ణి సమీపించి, "ఏమిటీ గత్తరంతా?" అని అడిగాడు.

ఉగ్రాక్షుడు ఆ ప్రశ్న వింటూనే అదిరి పడి, "చిత్రసేనా, వచ్చావా, వచ్చావా! అడుగో ఆ చెట్టు మీద వున్నవాడు, జ్వాలా ద్వీపం నుంచి వచ్చిన దుర్మార్గుడు. రాత్రి ఇక్కడ జరిగిన పోరాటంలో వెనకబడి పోయి మనకు దొరికాడు. ప్రాణాలతో వాణ్ణి పట్టుకోవటం సాధ్యం అయేలా లేదు. వీణ్ణించి మనం చాలా రహస్యాలు తెలుసుకోవచ్చు. మేము కాల్చుకు తింటా మని వాడు భయపడుతున్నాడు. నువ్వు అభయహస్తం యిచ్చి, వాణ్ణి ఏదో విధంగా చెట్టు నుంచి దింపాలి," అన్నాడు.

చిత్రసేనుడు దృష్టిని చెట్టు చిటారు కొమ్మలకేసి సారించి, "ఓరీ, నీ ప్రాణానికి వచ్చిన భయం ఏమీ లేదు. నువ్వు చెట్టు దిగి రా!" అని కేక పెట్టాడు.





''ఇంతమంది దిగమంటే దిగలేదు, నీ ఎక్కువేమిటి? నువ్వేమైనా మహారాజువా?'' అంటూ పులిచర్మం ధరించిన వాడు విసురుగా మాట్లాడాడు.

''అవును, నేను మహారాజునే. ఈ అడవీ, ఇందులో వున్న పల్లెలూ పట్టణాలూ నా పరిపాలనలోనే వున్నవి. నీకు ప్రాణభయం వుండదని అభయం ఇస్తున్నాను, నా మాట విని చెట్టు దిగి, రా;'' అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడు ఇలా అనగానే అక్కడ గుమిగూడిన ప్రజల్లో నుంచి, ''మహారాజుకూ, జై!'' అన్న కేకలు మిన్నుముట్టినై.

ఆ జయజయ ధ్వానాలు వింటూనే చెట్టు మీద వున్నవాడు ఆశ్చర్యంగా చిత్రసేనుడి కేసి చూసి, ''అయితే, ఈ రాక్షసుల మాటేమిటి? వాళ్ళు నన్ను చెయ్యికి చెయ్యి, కాలు కాలూ విరుచుకు తింటే?'' అన్నాడు.

''వాళ్ళ నుంచి నీకెలాంటి ప్రమాదమూ వుండదు. వాళ్ళూ నా ఆజ్ఞకు లోబడి వుండేవాళ్ళే,'' అంటూ చిత్రసేనుడు, ఉగ్రాక్షుడి కేసి తల తిప్పాడు. ఉగ్రాక్షుడు తన సేవకుల కేసి గుడ్లురిమాడు. ఆ వెంటనే, ''చిత్రసేన మహానాయకుడికీ, జై!'' అంటూ రాక్షసులంతా తలలు వంచారు. ఉగ్రాక్షుడు కూడా చిత్రసేనుడికి తల వంచి ప్రణామం చేస్తూ మెల్లిగా, ''ఈ మహారాక్షసుడికి ఎలాంటి ఖర్మ పట్టింది!'' అంటూ కోరలు కరకర మనిపించాడు.

''మహారాజా! మీరు అభయమిచ్చారు గనక చెట్టు దిగుతున్నాను,'' అంటూ పులిచర్మంవాడు చరచర చెట్టు దిగి వచ్చాడు.

''నీకేం భయం లేదు, ఆ కత్తి నా సేనాని పరం చెయ్యి,'' అన్నాడు చిత్రసేనుడు. పులిచర్మం ధరించినవాడు మారు మాటాడకుండా తన కత్తిని సేనానాయకుడికి అందించాడు.

''చిత్రసేనా, గానుగలో వేసి ఆడించవలసిన అపసరం కలక్కుండానే, వీణ్ణించి నువ్వు రహస్యాలు బయుట పెట్టించగల వనుకుంటాను,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''ఓం, నాకు తెలిసిన రహస్యాలన్నీ మీకు చెప్పేస్తాను. మనం అందరం స్నేహితులం అంటూ మంచి మాటలతో తీసుకువచ్చి, ప్రమాదం వచ్చేట్టు కనబడగానే నన్ను ఈ అడవిలో వదిలి ఆ దుర్మార్గులు పక్షుల మీద సవారై పారిపోయారు. వాళ్లు ఈ సరికి అక్కడెక్కడో తూర్పు సముద్రంలో వున్న జ్వాలాద్వీపాన్ని చేరి వుంటారని నా అనుమానం,'' అన్నాడు పులిచర్మంవాడు.

''నువ్వు ఆ ద్వీపం వాడివి కావా ?'' అని అడిగాడు చిత్రసేనుడు ఆశ్చర్యంగా.

''ఆ ద్వీపం వాణ్ణయితే, మీకు ప్రాణాలతో దొరికేవాణ్ణా ? నేను ఆ ద్వీపవాసులకు సహాయం చేస్తున్న కపిలపురం రాజు నాగవర్మ సైన్యంలో వాణ్ణి. నా పేరు అమరపాలుడు,'' అన్నాడు వాడు.

నాగవర్మ పేరు వింటూనే ఉగ్రాక్షుడు అదిరిపడి, ''సేనానాయకుడుగా వున్న ఈ నాగవర్మ కపిలపురానికి రాజెప్పుడయ్యాడు ? రాజు వీరసింహుడు ఏమయినట్టు ?'' అని అడిగాడు.

''వీరసింహమహారాజు బహుశా జ్వాలాద్వీపంలో బందీగా వుండి వుంటాడు. ఆయన రాజ్యాన్ని అపహరించటమే గాక,



ఆయన ఏకైక పుత్రిక కాంతిమతిని కూడా బలవంతాన వివాహమాడాలని ఈ నాగవర్మ ప్రయత్నిస్తున్నాడు. అంతే కాక, దుండగులైన జ్వాలాద్వీపవాసుల సహాయంతో, తను ఈ చుట్టుపక్కల వున్న రాజ్యాలను జయించి చక్రవర్తి కావాలని కూడా అతను ఆశపడుతున్నాడు," అన్నాడు అమరపాలుడు.

చిత్రసేనుడికి తన రాజ్యపు ఎల్లల్లో వున్న రాజులను గురించిన భోగట్టా ఏమీ తెలియదు. అమరపాలుడు చెపుతున్న దాన్నిబట్టి, ఈ సరికే తన సరిహద్దుల్లో వున్న ఒకానొక దుర్మార్గుడితో జ్వాలా ద్వీపవాసులు స్నేహం కట్టారు. ఇంతకూ అమరపాలుడు చెప్పేదంతా నిజమా? లేక ఇందులో ఏమైనా మోసం వున్నదా?

చిత్రసేనుడు ఇలా ఆలోచిస్తున్నంతలో, దూరంగా గుర్రాలు పరిగెత్తి వస్తున్న చప్పుళయింది. చూస్తూండగానే అతడి మంత్రీ, నలుగురు సైనికులూ అక్కడికి వచ్చి గుర్రాలు దిగారు. మంత్రి సరాసరి చిత్రసేనుడి దగ్గిరకు వస్తూ, "మహారాజా! ధవళగిరి నుంచి మీ తండ్రిగారు వర్తమానం పంపారు. నాగవర్మ అనే ఒక రాజద్రోహి సైన్యంతో ధవళగిరి మీదికి దాడి వెడలాడట. మీ నుంచి వెంటనే కొంత సైనిక సహాయం కావాలన్నారు," అన్నాడు.

చిత్రసేనుడు, తన సేనాని కేసి తిరిగి, "సేనానీ, నువ్వు మన సైనికుల్లో సగం మందిని వెంటబెట్టుకుని ధవళగిరికి బయలుదేరి వెళ్ళు. ఇక్కడ రక్షణ భారం నేను చూసుకుంటాను," అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అంటూ సేనాని అక్కడ నుంచి కదిలాడు.

"ఈ నాగవర్మ సైన్యాల వెంట భయంకర పక్షులెక్కిన జ్వాలాద్వీపవాసులెవరైనా వున్నారేమో!" అన్నాడు ఉగ్రాక్షుడు అమరపాలుడితో. అమరపాలుడు ఏదో జవాబు చెప్పబోయినవాడల్లా ఆగి, అందరి కేసీ ఓమారు అనుమానంగా చూసి, ఆకాశం కేసి తల ఎత్తాడు. —(ఇంకా వుంది)






# పుణ్యకార్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఉదారవంతుడివే కాక, పుణ్యకార్యాలపట్ల అసక్తి గలవాడిలా కూడా కనిపిస్తున్నావు. పుణ్యకార్యాలనేవి చేసిన వాళ్ళకేకాక, సమాజానిక్కూడా మేలు కలిగించగలవు. కాని, ఏ పుణ్యకార్యాలూ చేయనివాళ్లూ, ఒక్కొక్కసారి దేవుడి దయకు పాత్రులు కావడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇందుకు ఉదాహరణగా, ఒక ధనలోభీ, రాటుతేలిన దొంగా కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పాటలీపుత్ర నగరంలోని లోభచంద్రుడనే ధనికుడికి, ఏదో తెలియని జబ్బు

## బేతాళ కథలు



చేసింది. వైద్యులెవ్వరూ, ఆయన జబ్బును కుదర్చలేకపోయారు.

ఒక రోజున ఆయన ఇంటికి, ఒక సాధువు వచ్చి, లోభచంద్రుణ్ణి చూసి, "నువ్వు ధనవ్యామోహంతో పుణ్యకార్యాలు చేయలేదు సరికదా, ఎన్నో పాపకార్యాలు చేశావు. ఆ పాపాలే నిన్నిప్పుడు వ్యాధి రూపంలో పట్టి పీడిస్తున్నవి. పుణ్యం తప్ప, ఏ మందూ నీ వ్యాధిని కుదర్చ లేదు. ఇక మీదట పుణ్యకార్యాలు చెయ్యి," అని చెప్పాడు.

"పుణ్యకార్యాలంటే ఏమిటో, తమరే సెలవివ్వండి, స్వామీ!" అని అడిగాడు లోభచంద్రుడు.

"మనస్ఫూర్తిగా నువ్వు చేయగల ఏ మంచిపనైనా, పుణ్యకార్యమే అవుతుంది!" అని చెప్పి సాధువు వెళ్ళిపోయాడు.

అప్పుడు లోభచంద్రుడి కుటుంబ సభ్యులందరూ, ఆయన దగ్గర చేరారు. ఆయనకు ఇద్దరు కొడుకులూ, ఇద్దరు కూతుళ్ళూ వున్నారు.

"అన్నదానం చేద్దాం," అన్నది లోభచంద్రుడి భార్య చంద్రావతి.

"అన్నదానం అంటే, అవతలి మనిషికి తృప్తిగా భోజనం పెట్టాలి. మనింట్లో మనమే తృప్తిగా భోజనం చేయడం లేదు. అలాంటప్పుడు మనస్ఫూర్తిగా ఇతరులకు భోజనం పెట్టలేం గదా! ఇంకేదైనా పుణ్యకార్యం ఆలోచించండి," అన్నాడు లోభచంద్రుడు.

అందరూ తలా ఒక సూచనా యివ్వసాగారు. ఒకరు వస్త్రదానం అన్నారు. ఇంకొకరు విద్యాదానం చాలా ఉత్తమం అన్నారు. మరొకరు కన్యాదాతలకు సాయపడాలన్నారు. వేరొకరు డబ్బునే దానం చేయాలన్నారు.

ఆఖరుకు లోభచంద్రుడి భార్య చంద్రావతి, "పోనీ, తీర్థయాత్రలు చేసి రావడం బావుంటుందేమో! అందరు దేవుళ్ళనూ చూడడానికి మించిన పుణ్యం వేరే ఎక్కడుంటుంది?" అన్నది.

ఇది వింటూనే లోభచంద్రుడు, "దేవుణ్ణి చూడడానికి తీర్థయాత్రలు చేయనవసరం లేదు. ఎన్ని రూపాలున్నా దేవుడొక్కడే అని శాస్త్రాలు చెబుతున్నవి. కాబట్టి, మీరందరూ ప్రతి రోజూ, మన ఊరి ఆలయంలోని రాముణ్ణి, నా జబ్బు కుదర్చవలసిందిగా ప్రార్థించండి. ఆ పుణ్యం చాలు మనకు!" అన్నాడు.



దేనికీ డబ్బు ఖర్చు కావడం ఇష్టం లేక, లోభచంద్రుడు ఇలా అన్నట్టు అందరికీ అర్థమైంది. అతడి మాట కాదన లేక, అందరూ సరేనన్నారు. అయితే, లోభచంద్రుడి అనారోగ్యంలో మాత్రం ఏ మార్పూ రావడం లేదు.

"ఆ సాధువు చెప్పింది అబద్ధం. వ్యాపారపు గొడవల్లోపడి, నే నే నాడూ దేవుణ్ణి తలచలేదు; అదే నేను చేసిన పాపం. ఇప్పుడు రోజూ నేను దేవుణ్ణి తలచుకుంటున్నాను. మీరంతా ప్రార్థనలు చేస్తున్నారు. ఇంతకంటే పుణ్యకార్యం ఏం వుంటుంది? నా జబ్బుకు కారణం, నా పాపాలు కాదు; దురదృష్టం!" అని లోభచంద్రుడు రోజూ తనవాళ్ళందరికీ చెబుతూండేవాడు.

లోభచంద్రుడి ఇంట్లో తరగని సంపద వున్నదన్న విషయం తెలిసిన దొంగ ఒకడున్నాడు. లోభచంద్రుడి ఆరోగ్యం బావున్నప్పుడు, ఆ ఇంట్లో జొరబడే అవకాశం లేదు. ఇప్పుడు కొంచెం తెలివి ఉపయోగిస్తే, దొంగతనం చేయవచ్చునని వాడాలోచించి, ఒక పథకం వేశాడు.

ఆ ప్రకారం వాడు, రెండు రాత్రులు లోభచంద్రుడి ఇంటికి వెళ్ళాడు. అక్కడ వాడే వస్తువులూ దొంగిలించకుండా, తాను వచ్చిపోయిన జాడలు ఇంట్లోవాళ్ళు గుర్తించేలా చేశాడు.

తమ ఇంటికి ఎవడో దొంగ వచ్చి వెళుతున్నాడని, లోభచంద్రుడి భార్య గ్రహించి, ఆ సంగతి పిల్లలకు చెప్పి, "ఇది మీ నాన్నకు తెలియనీయకండి. ఇప్పుడున్న అనారోగ్యస్థితిలో, యీ సంగతి



ఆయనకు తెలియడం క్షేమం కాదు," అని హెచ్చరించింది.

అయితే, మూడో రోజున ఆ దొంగ, సాధువు వేషంలో లోభచంద్రుడి ఇంటికి వెళ్ళి, అతడితో, "నీవూ, నీ కుటుంబం గొప్ప ప్రమాదంలో వున్నారు. నిన్ను హెచ్చరించదలచి వచ్చాను!" అన్నాడు.

"ఏం జరిగింది, స్వామీ?" అని అడిగాడు లోభచంద్రుడు కంగారుపడిపోతూ.

"లక్ష్మి చంచలస్వభావం కలది. చాలా కాలంగా, నీ ఇంట్లో వుంటూ వచ్చింది. ఇప్పుడామె స్థలం మార్పు కోరుతున్నది. అందుకు రెండు ప్రయత్నాలు చేసి—మనసొప్పక ఆగిపోయింది. గత రెండు దినాల్లోనూ, నీ ఇంట దొంగతనానికి ప్రయత్నాలు జరిగాయి కదా?" అన్నాడు దొంగసాధువు.

లోభచంద్రుడు ఇది విని, భార్యాబిడ్డలను నిలదీసి అడిగేసరికి, వాళ్ళు సాధువు చెప్పింది నిజమే అన్నారు.

లోభచంద్రుడు భయపడిపోయి, దొంగ సాధువుతో, "స్వామీ, లక్ష్మిని మా ఇంట నిలిపే మార్గం లేదా?" అని అడిగాడు.

"లేకేం, ఉన్నది! పంచభక్ష్య పరమాన్నాలతో విందు భోజనం, నాకు పెట్టాలి. అ తర్వాత నేను లక్ష్మి ఉపాసన చేస్తాను. అది ముగిశాక, నేనిచ్చే తీర్థం మీరంతా పుచ్చుకోవాలి. అప్పుడు లక్ష్మి శాశ్వతంగా, ఈ ఇంట్లోనే ఉండిపోతుంది," అన్నాడు దొంగసాధువు.

లోభచంద్రుడిందుకు ఒప్పుకున్నాడు. ఆ రాత్రి చంద్రావతి చక్కని విందు భోజనం తయారు చేసి, దొంగకు పెట్టింది. తర్వాత వాడు కొంతసేపు లక్ష్మిపూజ చేసి, ఇంట్లో వాళ్ళందరికీ తీర్థం ఇచ్చాడు. అందులో వాడు మత్తుమందు కలపడంతో, వాళ్ళందరూ క్షణాల మీద స్పృహ తప్పిపడిపోయారు.

దొంగ అప్పుడు, లోభచంద్రుడి తలదిండు కింద వున్న ఇనప్పెట్టె తాళపు చెవులు తీసుకుని, దాన్ని తెరిచాడు.

అందులో వున్న నగలూ, బంగారు కాసులూ, వెండి సామగ్రీ చూసేసరికి, వాడి కళ్ళు చెదిరిపోయాయి. తానిచ్చిన మత్తుమందు సరిగా పని చెయ్యక, ఎవరైనా మేలుకున్నారేమో అని వాడు, అందరి ముఖాలకేసీ పరీక్షగా చూశాడు.

ఆ సమయంలో వాడు, చంద్రావతి ముఖం చూస్తూనే గతుక్కుమన్నాడు. ఆమె తనను కన్న తల్లిలా ఆదరించి, భోజనం పెట్టడం వాడికి గుర్తువచ్చింది.

''ఎంతో అభిమానంతో తృప్తిగా కడుపు నిండుగా భోజనం పెట్టిన, ఈ అమ్మ ఇంట్లో, నేను దొంగతనం చేయలేను!'' అనుకున్నాడు దొంగ.



వాడు ఇనప్పెట్టె తలుపులు మూసి, తాళం వేసి, తాళపు చెవులను లోభచంద్రుడి తలదిండు కింద పెట్టాడు. తరవాత వాడక్కడి నుంచి వెళ్ళిపోవాలనుకున్నాడు కాని, ఇంటిల్లిపాదీ స్పృహలో లేకపోవడం గుర్తుకు రాగానే ఆగిపోయాడు. ఆ సమయంలో మరే దొంగ అయినా ఇంట ప్రవేశించి దోచుకుపోవచ్చు! అందువల్ల, వాడు ఆ రాత్రంతా నిద్రపోకుండా ఇంటికి కాపలా కాశాడు.

తెల్లవారగానే, అందరికన్న ముందు చంద్రావతి లేచింది. ఆమె దొంగసాధువును చూసి నమస్కరించబోయింది. అప్పుడు దొంగ తన కథ అంతా ఆమెకు చెప్పుకుని, ''నాలో ఇప్పుడు మార్పు వచ్చింది. ఎక్కడైనా పని దొరికితే దొంగతనాలు మానేస్తాను,'' అన్నాడు.

చంద్రావతి వాడి నిజాయితీకి ఆశ్చర్యపడి, ''ఈ సంగతి నా భర్తకు చెప్పకు. ఆయన నిన్ను క్షమించడు. ఏమైతేనేం—నువ్వు చేసిన లక్ష్మీపూజ, నీ నుంచే యీ ఇంటిని కాపాడింది కదా? అందువల్ల, నువ్వు నిజమైన సాధువు కాదన్న విషయం, నా భర్తకు తెలియనవసరం లేదు,'' అన్నది.

కొంతసేపటికి లోభచంద్రుడికి మెలకువ వచ్చింది. అతడు మంచం మీది

నుంచి లేచి, ఒకసారి ఇల్లంతా తిరిగి వచ్చి భార్యతో, "నేనిప్పుడు మామూలుగానే లేచి తిరగ్గలుగుతున్నాను. లక్ష్మీ పూజ నా జబ్బును కూడా నయం చేసింది!" అన్నాడు ఉత్సాహంగా.

ఆ మాటలు వింటూనే దొంగ, "అయ్యా, ఈ అమ్మ, అసలు జరిగిన సంగతి దాచమన్నప్పటికీ, నేను దాచలేను. లక్ష్మీపూజలో మహిమ ఏమీలేదు," అని, తానెవరైనదీ లోభచంద్రుడికి చెప్పి, జరిగినదంతా వివరించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, లోభచంద్రుడు వ్యాధిపీడితుడై వుండగా చూడవచ్చిన సాధువు, అతణ్ణి మనస్ఫూర్తిగా ఏదైనా మంచి పని చేసి, పుణ్యం సంపాయించుకోమన్నాడు. పుణ్యం తప్ప, ఏ మందులూ అతడి వ్యాధిని కుదర్చలేవని హెచ్చరించాడు కూడా. అయితే, లోభచంద్రుడు దొంగకు తృప్తిగా పెట్టించిన భోజనం, లక్ష్మిని తన ఇంట నిలుపుకునేందుకే! అది స్వార్థంతో కూడినది; పుణ్యకార్యం అనిపించుకోదు. అయినప్పటికీ, అతడి వ్యాధి నయమైంది. ఇందుకు, కారణం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అమృతాన్ని తెలిసి సేవించినా; తెలియక సేవించినా అమరత్వం సిద్ధిస్తుంది. అదే విధంగా, పరహితం కోరి చేసే పని—స్వార్థంతో కూడినదైనా, తప్పక పుణ్యకారణం అవుతుంది. లోభచంద్రుడు మనస్ఫూర్తిగా దొంగకు పంచభక్ష్యపరమాన్నాలతో పెట్టిన భోజనం, అతడికి పుణ్యం సంపాయించి, వ్యాధినివారణ చేయడమే గాక, దొంగను కూడా సన్మార్గవర్తిని చేసింది. అందువల్ల, లోభచంద్రుడు పుణ్యకార్యం చేయలేదనడం సరికాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# తీర్థయాత్ర

దేవవరం అనే ఊళ్ళో, శేషయ్య పెద్ద నగలవ్యాపారి. ఆయన భార్య పేరు శ్యామల. ఒకసారి భార్యాభర్త లిద్దరికీ, తీర్థయాత్రలు చేసి రావాలన్న కోర్కె కలిగింది. ఆ సంగతి, ఊళ్ళోని రామశర్మ అనే పండితుడికి చెప్పి, ప్రయాణానికి మంచి ముహూర్తం పెట్టమన్నారు.

రామశర్మ ఒక మంచి ముహూర్తం చూసి, "మీ ఆలోచన మెచ్చదగింది. మీరు, యీ ప్రయాణ సమయంలో పిల్లలూ, ఇల్లూ, వ్యాపారం లాంటి గొడవలు గురించి ఆలోచించక, ఎల్లవేళలా దైవాన్ని మనసులో నిలుపుకోండి. అలా కానప్పుడు, తీర్థయాత్రాఫలం దక్కదు," అని హితబోధ చేశాడు.

ముహూర్తం నాడు భార్యాభర్తలు బయలుదేరి, పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ, ఒకనాటి మధ్యాహ్నం వేళ, ఒక నదీ ప్రాంతాన్ని చేరారు. నది ఒడ్డున ఒక చెట్లతోట వున్నది. శ్యామల ఒక చెట్టు నీడన కూర్చున్నది. శేషయ్య నదిలో స్నానం చేసి వస్తానని ఆమెకు చెప్పి వెళ్ళాడు.

నదికి అవతల ఒక పర్వతశ్రేణి వున్నది. వాటి రాళ్ళల్లో అప్పుడప్పుడూ చిన్న, చిన్న మణులు దొరుకుతవని, శేషయ్య విని వున్నాడు. అతడు స్నానం చేస్తున్నంతసేపూ, యీ విషయం గురించి ఆలోచిస్తూ, స్నానం ముగిశాక భార్య వున్నచోటుకు బయలుదేరాడు.

అతడు తిరిగి వస్తున్న సమయంలో, భార్య చెట్టుబోదెకు ఆనుకుని నిద్ర పోతున్నది. ఆమె కుడిచేతికి కొద్ది దూరంలో ధగధగమెరుస్తూ, ఏదో వస్తువు పడి వున్నది. శేషయ్య ఆశ్చర్యపోతూ, దాన్ని తీసుకుని పరీక్షగా చూశాడు. అది ఒక చిన్న మణి.

ఆర్. సత్యపతి

ఒకటి, రెండు నిమిషాలపాటు, ఆ మణిని ఏమి చేయడమా అని, శేషయ్య ఆలోచించాడు. తీర్థయాత్రలకు బయలు దేరేముందు, రామశర్మ చెప్పిన హితవు, అతడికి గుర్తు వచ్చింది. ధన మోహం కూడదు. ఈ విషయంలో తనది వజ్ర సంకల్పం. కాని, భార్యకు, ఆ మణిని దాచుకోవాలన్న బుద్ధి పుట్టవచ్చు! అందు వల్ల, దానిని ఆమె కళ్ళ పడకుండా చేయడం ఒక్కటే మార్గం. శేషయ్య ఒక చిన్న గొయ్యి తీసి, మణిని అందులో పడవేసి, గోతిని మట్టితో కప్పివేశాడు.

తర్వాత కొంత చల్లబడగానే, భార్యా భర్తలు తిరిగి ప్రయాణమయ్యారు. శేషయ్య భార్యతో, "నేను నదిలో స్నానం చేసి తిరిగి వచ్చాక, నీ పక్కన ఏదో వస్తువు పడి వుండడం చూశాను," అన్నాడు.

"చూశావా? నువ్వు చెప్పేది, ఒక చిన్న మణిని గురించా?" అన్నది శ్యామల.

శేషయ్య, ఆ ప్రశ్న వింటూనే ఆశ్చర్య పోయాడు.

శ్యామల తాపీగా, "నాకు కాస్త కునుకు పడుతున్న సమయంలో, డేగ ఒకటి వచ్చి, చెట్టు కొమ్మల్లో వాలింది. దాని ముక్కున మెరుస్తూ, ఏదో వస్తువు వుండడం గమనించాను. అంతలో, అది డేగ ముక్కు నుంచి జారి, నా పక్కన పడింది. అది ఒక చిన్న మణి అని తెలుసుకున్నాను. ఈలోపల నాకు నిద్ర ముంచుకువచ్చింది," అన్నది.

"ఆ మణిని తీసుకోవాలన్న కోర్కె కలగలేదా?" అని అడిగాడు శేషయ్య.

"అలాంటి కోర్కె, నాకెలా కలుగు తుంది! మనం బయలుదేరింది పుణ్యం సంపాయించుకునేందుకు; మణులు సంపాయించుకునేందుకు కాదు గదా? మనకు, ఈ తీర్థయాత్ర సమయంలో మణిమాణిక్యాలనేవి, మట్టిగడ్డల్లా కన బడకపోతే, మనం పుణ్యఫలానికి అర్హులం కాదు," అన్నది శ్యామల.

ఈ జవాబు విన్న తరవాత, శేషయ్యకు భార్యపట్ల మరింత ఆదరభావం కలిగింది.






మన దేవాలయాలు :

# కాంచీపురం

బ్రహ్మదేవుడు ఒకప్పుడు యజ్ఞం చేయ డానికి తలపెట్టి, దానికి అనువైన స్థలం కోసం వెతుకుతూ, సత్యవ్రత క్షేత్రమని ప్రసిద్ధిగాంచిన కాంచీపురం చేరు కుని, అక్కడ యజ్ఞం ప్రారంభించాడు.

సరస్వతీదేవికి ఇది ఎందుకో ఇష్టం లేక పోయింది. ఆమె వేగవతీనదీ రూపం దాల్చి, యజ్ఞవాటికను జలమయం చేయడానికి ఉరుకులతో, పరుగులతో రాసాగింది. అప్పుడు మహావిష్ణువు అడ్డంగా పడుకుని, నదీప్రవాహాన్ని ముందుకు పోనీకుండా ఆపాడు.





ఆ తరవాత బ్రహ్మదేవుడి ప్రార్థన మేరకు మహావిష్ణువు అక్కడే భక్తు లకు కోరిన వరాలు ప్రసాదించే వరద రాజస్వామిగా వెలిశాడు. ఈనాడు వెలుగొందుతున్న వరదరాజస్వామి ఆలయం, పలు పురాతన ఆలయాల పునాదుల మీద నిర్మించబడి ఉన్నది.




పల్లవరాజయిన రాజసింహుడు నిర్మించిన శ్రీ కైలాసనాథ ఆలయం అద్భుతమైన శిల్పకళకు ప్రసిద్ధి గాంచింది. గర్భగృహంలోని శివలింగం పదహారు ఫలకాల నుంచి తయారు చేయబడింది. ఆలయ ప్రాకారం చుట్టూ యాభై ఎనిమిది చిన్న దేవాలయాలు ఉన్నాయి.

మరొక పల్లవరాజయిన నందివర్మ పల్లవ మల్లుడు నిర్మించిన శ్రీ వైకుంఠపెరుమాళ్ ఆలయం కూడా చాలా అద్భుతమైన కళాఖండంగా భావించబడుతున్నది. మూడంతస్తులతో వెలిగే ఆలయ విమానంలో—మహావిష్ణువు నిలబడినట్టూ, కూర్చున్నట్టూ, శయనించినట్టూ మూడు భంగిమలలో చెక్కబడి ఉన్నది.





ఇక్కడ వెలుగొందే ఏకాంబరనాథ ఆలయం అతి ప్రాచీనమైనది. ఇక్కడ ఒకప్పుడు వేయిస్తంభాల మంటపం ఉండేది. ఇప్పుడు ఆ మంటపంలో ఆరు వందలా పదహారు స్తంభాలు ఉన్నాయి. సువిశాలమైన ఈ దేవాలయ ప్రాంగణం నిండా ఎన్నో ఆలయాలూ, మంటపాలూ, గోపురాలూ, తటాకాలు ఉన్నాయి.

పార్వతీపరమేశ్వరుల వివాహాన్ని తిల కించడానికి, దేవతలూ, ఋషులు అందరూ కైలాసం చేరారు. అప్పుడు పరమేశ్వరుడు, భారతభూమి అధ్యాత్మిక భారాన్ని సమతలంగా ఉంచడం కోసం అగస్త్యమునిని దక్షిణదేశానికి వెళ్లమని ఆదేశించాడు.





అగస్త్యుడు అందుకు అంగీకరించాడు. కాని తనకు పార్వతీపరమేశ్వరుల వివాహాన్ని దర్శించే భాగ్యాన్ని కలిగించవలసిందిగా పరమేశ్వరుని ప్రార్థించాడు. అతని కోరికను తీర్చడానికి పార్వతీదేవి, కన్యగా మళ్ళీ కాంచీపురం నదీ తీరంలో పరమశివుని లింగరూపంలో పూజించసాగింది.

పార్వతీదేవిని పరీక్షించే ఉద్దేశంతో, శివుడు లింగాన్ని కొట్టుకుపోయేట్టు చేయడానికి నదిలో వెల్లువను పుట్టించాడు. కాని, పార్వతి శివలింగాన్ని హృదయానికి హత్తుకుని, తను కూడా వెల్లువలో కొట్టుకుపోవడానికి సిద్ధమయింది. అప్పుడు శివుడు అక్కడ ప్రత్యక్షమై, ఆమెను పెళ్ళాడాడు. అగస్త్యుడు పార్వతీపరమేశ్వరుల వివాహాన్ని తనివితీరా చూసి ఆనందించాడు.





ఈ ఆలయ ప్రాంగణంలో వెయ్యి సంవత్సరాలకు పైబడిన మామిడిచెట్టు ఉండడం వల్లనే, దీనికి ఏకాంబరనాథ ఆలయం అన్న పేరు వచ్చిందని విశ్వసింపబడుతున్నది. నాలుగు వేదాలకు సంకేతాలుగా వెలిగే ఈ వృక్షం, నాలుగు కొమ్మల నుంచి నాలుగు రకాల రుచులతో మామడికాయలు కాయడం విశేషంగా చెప్పుకుంటారు.

కాంచీపురం మన దేశంలోని సప్త పుణ్యక్షేత్రాలలో ఒకటి. ఆదిశంకరులు ఇక్కడ కామకోటిపీతాన్ని నెలకొల్పారు. హజారత్ హమీద్ అవాలియా అనే ముస్లిం మతగురువు కాంచీపురాన్నే తన నివాసస్థలంగా ఎన్నుకున్నాడు.






ఒకప్పుడు బౌద్ధమతానికి కూడా, ఈ నగరం కేంద్రంగా వెలుగొందేది. ఏడవ శతాబ్దంలో హుయాన్‌త్సాంగ్ అనే చీనా యాత్రికుడు ఈ నగరాన్ని సందర్శించాడు. అప్పుడాయన ఎన్నో బౌద్ధారామాలు దర్శించినట్టు రాసుకున్నాడు. అయినా కాలప్రవాహంలో అవన్నీ కొట్టుకుపోయాయి.



# కవిసన్మానం

విశాఖదత్తు డనే రాజు, వత్సదేశపు సింహాసనం అధిష్ఠించాక, దేశంలో కవులకు బొత్తిగా ఆదరణ లేకుండా పోయింది. ఇందుకు కారణం, ఆయన మంత్రి మంజునాధుడు. ఏ పనీపాటూ చేతకాని వాళ్ళే, కవిత్వం చెప్పుకుని బతుకుతారన్న దురభిప్రాయం, ఆయనకున్నది.

''కవులను పోషించడం శుద్ధదండగ. అందువల్ల, ఖజానా ఖాళీ అవడం తప్ప, దేశానికి కలిగే మేలు చిన్న మెత్తు వుండదు!'' అని మంత్రి తరచు రాజుతో చెపుతూండేవాడు.

విశాఖదత్తుడికి స్వతహాగా కవుల పోషణపట్ల ఆసక్తి వున్నది. కాని, వయోవృద్ధుడూ, తనకు అనేక సందర్భాలలో చక్కని సలహాలిచ్చి సాయపడినవాడూ అయిన, మంత్రి మాటను తోసిపుచ్చడానికి సంకోచించేవాడు.

ఒకనాడు విశాఖదత్తుడి వద్దకు, యువకుడూ, స్ఫురద్రూపీ అయిన చాంద్రాయణుడు అనే కవి వచ్చి, రాజుకు తన పేరు చెప్పుకుని, ''మహాప్రభూ, నేను, తమ తాతగారివద్ద ఆస్థానకవిగా వుండిన, సుధాకరభట్టారకుడి మనమడిని. రాజాదరణలేక మా కుటుంబం, ఇప్పుడు దరిద్రావస్థలో వున్నది. మా తాతగారివలె, నేను కూడా కవిత్వం చెప్పగలను. ఏకకాలంలో అష్టావధాన, శతావధానాలు చెయ్యగలగడం, నా ప్రత్యేకత. నా విద్యను తమముందు ప్రదర్శించి, రాజాశ్రయం సంపాదించాలన్న ఆశతో వచ్చాను,'' అన్నాడు.

తన రాజ్యానికి ఒకప్పుడు ఎంతో కీర్తిప్రతిష్ఠలు సంపాయించిపెట్టిన, సుధాకర భట్టారకుడి కుటుంబం, దీనావస్థలో వుండడం, విశాఖదత్తుడికి చాలా బాధ

జొన్నలగడ్డ రత్న



కలిగించింది. ఎంతో ఆత్మవిశ్వాసంతో, రాజసభలో తన ప్రజ్ఞను ప్రదర్శిస్తానంటూ వచ్చిన, ఆ యువకుణ్ణి చూడగానే ఆయనకు ముచ్చటవేసింది.

విశాఖదత్తుడు, చాంద్రాయణుడితో ఏదో చెప్పబోతూండగా, అంతలో మంత్రి మంజునాథుడు ఆయనకు అడ్డుపడి, చాంద్రాయణుడితో, "మీ తాతగారయిన సుధాకరభట్టారకుల వారి గొప్పతనం, మాకెవరికీ తెలియంది కాదు. చెట్టు పేరు చెప్పి కాయలమ్ముకోవడం, లోకసహజం. నువ్వు వయసూ, మంచి దేహదారుఢ్యం వున్నవాడివి. ఇలా కవిత్వాన్ని నమ్ముకోక పోతే—మరేదైనా పని చేసుకుని హాయిగా బతకడానికి ఎందుకు ప్రయత్నించ కూడదు?" అని ప్రశ్నించాడు.

ఒక దేశపు మంత్రి అలా మాట్లాడడం విని, చాంద్రాయణుడు ఒక క్షణకాలం నివ్వెరపోయి, అంతలోనే తేరుకుని, "నేను ఉదరపోషణార్థం రాజాశ్రయం కోరి వచ్చిన మాట వాస్తవమే. కవిత్వం చెప్పడం, నా ప్రత్యేక అర్హతకాబట్టి, ఆ కారణంగా నాకు రాజాశ్రయం లభిస్తుందనుకున్నాను. అలా కాక, మహారాజుగారు మరే విధంగానైనా తమ కొలువులో ఆశ్రయం కల్పిస్తానన్నా, అందుకు సిద్ధమే," అన్నాడు.

విశాఖదత్తుడు, చాంద్రాయణుడి వినయానికి సంతోషించి, మంత్రి మంజునాథుణ్ణి సమాధానపరుస్తున్నట్టుగా, "మహామంత్రీ! ఇబ్బందులలో వుండి, ఈ యువకుడు మనను కొలువు ఇప్పించవలసిందిగా వేడుకుంటున్నాడు. మనం ఇతడి తాతగారిపట్ల గల గౌరవం కొద్దీ అయినా, ఏదైనా ఉద్యోగం యివ్వగలమేమో ఆలోచించండి," అన్నాడు.

మంత్రి ఒక క్షణం ఆలోచించి, "ప్రభువుల ఆజ్ఞ! వారం క్రితం, మన అశ్వశాలలో గుర్రాలను కడిగేవాడు, జబ్బుచేసి ఉన్నట్టుండి మరణించాడు. వాడి స్థానాన్ని ఇంకా భర్తీ చేసినట్టులేదు. అభ్యంతరం

లేకపోతే, ఇతడా పనిలో చేరవచ్చు.'' అన్నాడు.

ఒక కవిని ఇలా అవమానించే అవకాశం కలిగినందుకు, మంత్రి లోలోపల చాలా ఆనందపడుతున్నాడు.

అయితే, చాంద్రాయణుడు మాత్రం ఏమీ తొణకకుండా, ''శ్రమించడమన్నది, దేవతార్చనకు ఈడైనది. ఆ శ్రమించడమన్నది శరీరంతో కావచ్చు, లేక బుద్ధీ, మనసులతో కావచ్చు. క్షుధానివృత్తికి, నీతిబద్ధంగా చేసే ఏ పనిలోనూ, ఉచ్చ నీచలంటూలేవు. ఇప్పటి పరిస్థితుల్లో, నాకు కావలసింది రాచకొలువు,'' అన్నాడు.

చాంద్రాయణుడి జవాబుకు, మంత్రి నిర్ఘాంతపోయి, అంతలోనే ఏదో ఆలోచన వచ్చినవాడిలా, ''ప్రభూ, యీ చాంద్రాయణుడు చాలా ఘటికుడు! కులీనుడుగా పుట్టి, చదువు సంస్కారం వున్న ఇతడు — అశ్వశాలలో వెట్టిచాకిరీ చెయ్యడానికి సిద్ధపడడంలో, ఒక దురుద్దేశం వున్నది. అది నాకు అర్థమైంది. తమ సెలవైతే వివరిస్తాను,'' అన్నాడు.

రాజు విశాఖదత్తుడూ, చాంద్రాయణుడూ ఆశ్చర్యపోతూ, మంత్రి కేసి చూశారు.

మంత్రి, రాజుతో, ''తమ రాజ్యంలో కవులకు ఆదరణలేక, వాళ్ళు గుర్రపుశాలల్లాంటివి శుభ్రం చేస్తూ బతుకు వెళ్ళబుచ్చుతున్నారని, ఇతడు రుజువు చేయదలిచాడు. ఆ విధంగా, దేశదేశాల్లో,



తమను అప్రతిష్ఠపాలు చెయ్యడం కోసం, మనం ఇస్తామన్న పనికి ఒప్పుకున్నాడు,'' అన్నాడు.

చాంద్రాయణుడు వస్తున్న కోపాన్ని నిగ్రహించుకుని, రాజుతో, ''ప్రభూ, కవిగా తమ కొలువులో చేరదలచి వచ్చిన నాకు, అశ్వశాలలో ఉద్యోగం యివ్వవచ్చని మంత్రిగారనడంలో వున్న భావం, నా కర్థం కావడం లేదు. అయితే, నేను మాత్రం, వారిస్తానన్న పనిని సదుద్దేశంతోనే అంగీకరించాను,'' అన్నాడు.

''ఏమిటా సదుద్దేశం?'' అని ప్రశ్నించాడు మంత్రి.

"విశాఖదత్త మహారాజుగారి రాజ్యంలో, గుర్రాలు కడిగేవాడు కూడా చక్కగా కవిత్వం చెప్పగలడని, నలుగురూ అనుకున్నప్పుడు, మహారాజుగారి కీర్తిప్రతిష్ఠలు ఇనుమడింపవా?'' అని అడిగాడు చాంద్రాయణుడు.

మంత్రి జవాబు చెప్పలేక, నిశ్చేష్టుడై చూస్తూ వూరుకున్నాడు.

అప్పుడు చాంద్రాయణుడు, ''మంత్రిగారికి కవులపట్ల గల చిన్నచూపుకు కారణం, నాకు తెలియదు. ఏ దేశం గొప్పతనానికైనా, ఆ దేశం వర్తక వ్యాపారాల్లో, వృత్తిపనుల్లో సాధించిన విజయంతో పాటు, కవుల ప్రతిభ కూడా కారణం అవుతుంది. శరీరరక్షణకు మనిషికి తిండీ, బట్టా ఎంత అవసరమో, మనోల్లాసానికీ, ఆనందానికీ కవిత్వం కూడా అంతే అవసరం,'' అన్నాడు.

ఆ మాటలు విన్న మంత్రి ''చాంద్రాయణా! నువ్వు చిన్నవాడివైనా, నా కళ్ళు తెరిపించావు. నువ్వు కవిగా, మీ తాతగారంతటి ప్రతిభావంతుడివి కాగలవని, నా నమ్మకం. ఈనాటి నుంచీ నేను, కవి సన్మానానికి వ్యతిరేకిని కాను,'' అన్నాడు.

మంత్రి మంజునాధుడిలో వచ్చిన మార్పుకు చాంద్రాయణుడితోపాటు, రాజు కూడా చాలా సంతోషించాడు. ఆనాడే ఆయన చాంద్రాయణుణ్ణి ఘనంగా సత్కరించి, ఆస్థానకవిగా నియమించాడు.






అగస్త్యమహర్షి రాముడికి, సుకేశుడి కుమారులైన మాల్యవంతుడూ, మాలీ, సుమాలీ, లంకలో నివాసం ఏర్పాటు చేసుకుని, తమ భార్యలతోనూ, పిల్లలతోనూ నిర్విచారంగా ఉంటూ, వరాలు పొందిన గర్వంతో ముల్లోకాలనూ క్షోభ పెట్టారని వివరంగా తెలిపి, ఇంకా ఇలా అన్నాడు:

రాక్షసులు పెట్టే యాతనలు భరించలేక దేవతలూ, ఋషులూ మహేశ్వరుడి వద్దకు వెళ్ళి, "జగద్రక్షకా! సుకేశుడి కొడుకులు బ్రహ్మనుంచి వరాలు పొంది పొగరెక్కి, స్వర్గం నుంచి దేవతలను తరిమేసి దాన్ని తాము ఆక్రమించుకున్నారు. మునుల ఆశ్రమాలూ, ఇళ్ళూ శూన్యం పెట్టేశారు. బ్రహ్మ, రుద్రుడూ, విష్ణువూ, ఇంద్రుడూ, యముడూ, వరుణుడూ, చంద్రుడూ, సూర్యుడూ అందరూ తామేనని అమిత గర్వంతో చెప్పుకుంటున్నారు. ఏక్షణం చూసినా యుద్ధ సన్నద్ధులై ఉండే ఆ రాక్షసుల నుంచి, మమ్మల్ని కాపాడు." అని భయపడుతూ వేడుకున్నారు.

అయితే మహేశుడు సుకేశుడి పట్ల పక్షపాతం కలవాడు. అందుచేత ఆయన దేవతల, ఋషుల ప్రార్థన నంతా విని వారితో, "దేవతలారా, మహర్షులారా! ఆ రాక్షసులను చంపటం నాకు సాధ్యం కాదు. వారి చావు నా చేతిలో లేదు. నా మాట విని మీరు విష్ణువు వద్దకు వెళ్ళా

2. రావణుడి జననం



రంటే, ఆయన తప్పకుండా వాళ్ళను చంపగలడు,'' అన్నాడు.

దేవతలు మొదలైనవారు మహేశ్వరుడికి జయం పలికి విష్ణుమూర్తివద్దకు వెళ్ళి, మహేశ్వరుడితో మొరపెట్టుకున్నట్టే మొరపెట్టుకుని, త్రికూటపర్వతం మీది లంకానగరంలో చేరిన రాక్షసులను చంపి, తమను కాపాడమనీ, తమకు వేరే దిక్కు లేదనీ వేడుకున్నారు.

విష్ణుమూర్తివారికి అభయమిచ్చి, ''నేను సుకేశుణ్ణీ, అతని ముగ్గురు కొడుకులనూ ఎరుగుదును. వారి ప్రవర్తన చూస్తే నాకూ మంటగానే ఉన్నది. నేను వాళ్ళను సంహరిస్తాను. మీరు భయపడకండి,'' అన్నాడు. ఈ మాటలు విని దేవతలు పరమానందభరితులై, విష్ణుమూర్తిని ప్రశంసించి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఈ సంగతి లంకలో తెలిసింది. మాల్యవంతుడు తన తమ్ములతో, ''దేవతలూ, ఋషులూ చేరి మనను చంపించటానికి చూస్తున్నారు. వాళ్ళు మహేశ్వరుడి వద్దకు వెళ్ళి మనను చంపమని కాళ్ళా, వేళ్ళా పడ్డారట. ఆ పని తనకు సాధ్యం కాదనీ, విష్ణుమూర్తివద్దకు వెళ్ళమనీ మహేశ్వరుడు సలహా ఇచ్చాడట. ఆ సలహా ప్రకారం వాళ్ళు విష్ణుమూర్తివద్దకు వెళ్ళి ఆయన కాళ్ళపైన పడ్డారట. ఆయన మననందరినీ చంపుతానని వారికి అభయమిచ్చి పంపేశాడట. విష్ణుమూర్తి మనని చంపటానికి నిశ్చయించినట్టయితే మనమేం చెయ్యాలో ఆలోచించటం మంచిది. ఎందుకంటే, ఆయన హిరణ్యకశిపుడిలాటి అనేకమంది ప్రబల రాక్షసులను చంపి ఉన్నాడు. ఎన్నో వరాలు పొంది, యజ్ఞాలు చేసి, దివ్యాస్త్రాలు సంపాదించి, మాయలలో ఆరితేరిన చాలామంది రాక్షసులాయనతో యుద్ధం చేసి చచ్చారు. ఈ సంగతి మనసులో ఉంచుకుని మన తక్షణ కర్తవ్యం నిర్ణయించుకోవాలి,'' అన్నాడు.

దీనికి మాలీ, సుమాలీ అన్నతో ఇలా చెప్పారు :

''మనం పండితులం; యజ్ఞాలూ, దానాలూ చేసినవాళ్ళం; మనకు అంతు లేని ఐశ్వర్యం ఉన్నది; అత్యంత బలవంతులైన శత్రువులను జయించాం; విష్ణుమూర్తి అయేది, రుద్రుడయేది, ఇంద్రుడయేది మన ఎదట నిలబడలేడు. మనకే లోకాలన్నీ వణికిపోతాయి. విష్ణుమూర్తి మనని ద్వేషించటానికి కారణమేమీ కనబడదు. ఈ దేవతలే ఆయనను రేపెట్టి ఉంటారు. అందుకు మనం సైన్యాలతో సహా బయలుదేరి వెళ్ళి ఆ దేవతల పని పట్టిద్దాం.''

ఈ విధంగా ఆలోచించుకుని ఆ రాక్షస సహోదరులు యుద్ధ యత్నాలు చేసి, సైన్యసమేతులై స్వర్గంమీదికి బయలుదేరారు. లంకనుంచి వారివెంట రథాలూ, ఏనుగులతో, గుర్రాలతో, ఒంటెలు మొదలైన వాటితో నడిచే వాహనాలూ, స్వర్గాన్ని ముట్టడించటానికి కదిలాయి. అపారమైన ఆ రాక్షస సేనకు నాయకుడు మాలి. ఇలా రాక్షసులు లంకను విడిచి బయలుదేరగానే లంక పాడుపడి నట్టయింది.

రాక్షసులు యుద్ధానికి కదిలిన మాట తెలియగానే విష్ణుమూర్తి, ధగధగా మెరిసే కవచం ధరించి, బాణాలూ, విల్లూ,



శంఖమూ, చక్రమూ, గదా, ఖడ్గమూ తీసుకుని, పీతాంబరంతో గరుడవాహన మెక్కి వచ్చి దేవసేనను చేరగానే ఉభయ పక్షాలకూ యుద్ధం ప్రారంభమయింది.

విష్ణుమూర్తి తన బాణాలతోనూ, చక్రంతోనూ అనేకమంది రాక్షసులను చంపాడు. కాని మాలి విష్ణుమూర్తి నెదుర్కొని, అతి దారుణమైన యుద్ధం చేసి, విష్ణుమూర్తి వాహనమైన గరుత్మంతుడి తలమీద బలంగా కొట్టి, యుద్ధరంగం నుంచి పారిపోయేటట్టు కూడా చేశాడు. అయితే చివరకు విష్ణుమూర్తి తన చక్రాయుధంతో మాలి తల తెగనరికాడు. మాలి చావటం





చూసి సుమాలీ, మాల్యవంతుడూ, తమ రాక్షసబలాలతో సహా లంకలోకి పారిపోయారు. విష్ణుమూర్తి ఆ రాక్షసులను వెన్నాడి వధించసాగాడు.

అది చూసి మాల్యవంతుడు, ''నీవు క్షత్రియ ధర్మం కూడా పాటించకుండా పారిపోతున్న మమ్మల్ని వెంటాడి చంపుతున్నావే! అటువంటి వాడికి వీరస్వర్గం కూడా రాదుగద. నీకంతగా యుద్ధం చెయ్యాలని ఉంటే నాతో చెయ్యి,'' అంటూ విష్ణువుకు ఎదురుగా నిలబడ్డాడు.

''మీరు యుద్ధరంగం నుంచి పారిపోవటమేగాదు, పాతాళలోకంలో దాక్కున్నా వెతికి చంపుతాను. మిమ్మల్ని చంపుతానని దేవతలకు మాట ఇచ్చాను. ఆ మాట తప్పను,'' అన్నాడు విష్ణుమూర్తి.

ఇద్దరూ యుద్ధానికి తలపడ్డారు. మాల్యవంతుడు విష్ణుమూర్తినీ, గరుత్మంతుణ్ణి కూడా చాలా పీడించాడు. అయితే గరుత్మంతుడు తన రెక్కలు విసిరి గాలి పుట్టించేసరికి, ఆ గాలి మాల్యవంతుణ్ణి ఆకాశంలోకి ఎగరగొట్టింది. అది చూసి సుమాలి తన సైన్యంతో సహా లంకలోకి పారిపోయాడు. మాల్యవంతుడు ఎలాగో తన సేనను కలుసుకుని, పుట్టెడు పరాభవంతో లంకకు చేరుకున్నాడు.

అటు తరవాత విష్ణుమూర్తి లంకావాసులైన రాక్షసులతో అనేక యుద్ధాలు చేసి, అనేకమంది రాక్షసవీరులను చంపిన అనంతరం, చావగా మిగిలిన రాక్షసులు తమ భార్యలతోనూ, పిల్లలతోనూ, పరివారంతోనూ లంకను విడిచిపెట్టి పాతాళలోకానికి వెళ్ళి, అక్కడ నివాసం ఏర్పరుచుకుని, సుమాలిని తమ అధిపతిగా చేసుకున్నారు. ఆ కాలంలో విష్ణుమూర్తి చేత చచ్చిన మాల్యవంతుడు మొదలైన రాక్షసులు రావణ కుంభకర్ణులకంటె బలవంతులు.

రాక్షసులు లంకను విడిచి వెళ్ళిపోగానే వైశ్రవణుడు (కుబేరుడు) తిరిగి లంకలో నివసించ నారంభించాడు.



కొంతకాలం గడిచింది. సుమాలి ఒక నాడు కైకసి అనే తన కుమార్తెను వెంట బెట్టుకుని పాతాళలోకం నుంచి భూలోకంలో విహరించవచ్చాడు. వారు భూమి మీద తిరుగుతూ వుండగా, పుష్పకం ఎక్కి తన తండ్రిని చూడటానికి వెళుతున్న కుబేరుడు వారికి కనిపించాడు.

కుబేరుడి ఐశ్వర్యంతో తన దౌర్భాగ్యస్థితిని పోల్చుకుని సుమాలి, "ఏం చేస్తే మేం వృద్ధిలోకి వస్తాం?" అని ఆలోచించుకుని, చివరకు ఒక ఆలోచన చేశాడు. అపర లక్ష్మిదేవి లాటి తన కుమార్తెతో అతను, "అమ్మా, నీకు పెళ్ళియీడు వచ్చింది. నిన్ను పెళ్ళాడగోరేవారు చాలామంది వున్నారు. కాని నీవు ఒప్పుకోవని సంశయిస్తున్నాను. విశ్రవసుడి కొడుకైన కుబేరుడి మహావైభవం కళ్ళారా చూశావుగద. విశ్రవసుడు పులస్త్య బ్రహ్మ కొడుకు, మహాముని. ఆయనను సేవించావంటే నీక్కూడా ఇలాటి కొడుకులే కలుగుతారు," అన్నాడు.

కైకసి తండ్రి మీది గౌరవం కొద్దీ బయలుదేరి, విశ్రవుడు తపస్సు చేసుకునే చోటికి వెళ్ళినిలబడింది. ఆ సమయానికి విశ్రవుడు అగ్నిని అర్చిస్తున్నాడు. నిండు చంద్రుడి లాగా వెలిగిపోతున్న కైకసిని చూసి విశ్రవుడు, "సుందరీ, ఎవరి కుమార్తెవు? ఎక్కడి నుంచి వచ్చావు? ఏం పని మీద వచ్చావు? నిజం చెప్పు," అన్నాడు.

కైకసి చేతులు జోడించి, "మునీశ్వరా, మీరు తపశ్శక్తితో అంతా తెలుసుకోగలరు. నేను వా తండ్రి ఆజ్ఞప్రకారం వచ్చాను. నా పేరు కైకసి," అన్నది.

"అవును, తెలిసింది. నా వల్ల కొడుకులను కోరి వచ్చావు," అని విశ్రవుడామెను యథావిధిగా పెళ్ళాడి, "నీవు సంతానం కోరి వచ్చినది రాక్షసఘడియలలో. ఆ కారణంగా నీకు దారుణమైన మహా క్రూరులైన రాక్షసులు కలుగుతారు," అన్నాడు.



"మీవంటి తపశ్శాలికి అలాటి పిల్లలు పుట్టటమా? నాకు అవసరం లేదు. మంచి పిల్లలను దయచేసి అనుగ్రహించండి," అన్నది కైకసి. ఆమె ఎంతో బతిమాలిన మీదట విశ్రవుడు, "సరే, నీ చిన్న కొడుకు నీ వంశానికి తగి ఉంటాడులే," అన్నాడు.

కొంతకాలం గడిచాక కైకసి ఒక పిల్లవాణ్ణి కన్నది. వాడు చూడటానికి పరమ వికారంగా ఉన్నాడు—రాక్షసి రూపం, భయంకరాకారం, పది తలలు, పెద్ద కోరలు, కాటుక రంగు శరీరచ్ఛాయ, ఎర్రని పెదవులు, ఇరవై చేతులు, పెద్ద పెద్ద నోళ్ళు! అతనికి పది తలలుండటం చూసి, విశ్రవుడా కుర్రవాడికి దశగ్రీవుడు (పది కంఠాలు గలవాడు) అని నామకరణం చేశాడు. అతనే రావణుడు.

రావణుడి తరవాత పుట్టిన కుంభకర్ణుడు, మహాబలుడు, ఏ జంతువుకూ లేనంత పెద్ద శరీరం గలవాడు. అతని అనంతరం వికృతమైన ముఖం గల శూర్పణఖ పుట్టింది. అందరికన్న ఆఖరుకు పుట్టినవాడు విభీషణుడు. అతను సత్యగుణం గలవాడు.

రావణ కుంభకర్ణులు అరణ్యంలోనే పెరుగుతూ, తమ అసాధారణ బలంతో అక్కడి వారందరికీ దిగులు పుట్టించసాగారు. కుంభకర్ణుడు ఋషులను పట్టుకుని తినేస్తూ ఉండేవాడు. విభీషణుడు మాత్రం స్వాధ్యాయం చేస్తూ, నియమితాహారుడై, ధర్మమార్గం అవలంబించాడు.

వారందరూ ఆశ్రమంలోనే ఉండగా, ఒకనాడు కుబేరుడు పుష్పకం పైన తన తండ్రిని చూడవచ్చాడు. కుబేరుడి తేజస్సూ, ఐశ్వర్యమూ చూసి అసూయపడిన కైకసి తన పెద్ద కొడుకైన రావణుడితో, "మీ అన్న అయిన కుబేరుడి వైభవం చూశావా? ఆ తండ్రికి పుట్టిన వాడివే గదా, నీవు చూడు ఎలా గున్నావో! నీవు ఆ కుబేరుడితో సమానంగా ఉంటే

నేను సంతోషిస్తానురా నాయనా," అన్నది.

అమిత ప్రతాపశాలి అయిన రావణుడికీ మాటలు రోషం తెప్పించాయి. అతను తన తల్లితో, "అమ్మా, నేను నా సవతి అన్నతో సమానుణ్ణో, అంతకు మించిన వాణ్ణో అయి తీరుతాను. విచారించకు," అని ప్రతిజ్ఞ చేశాడు. అతను కుంభకర్ణుడితో కలిసి మహత్తరమైన పనులు చేయాలని సంకల్పించుకుని, తన తమ్ములతో సహా గోకర్ణాశ్రమానికి వెళ్ళి, అక్కడ అతి తీవ్రమైన తపస్సు చేశాడు. అతనితో కుంభకర్ణ విభీషణులు కూడా తపస్సు చేశారు.



రావణుడు నిరాహారుడై పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. అతను వెయ్యి సంవత్సరాలకొక శిరస్సు చొప్పున నరికి అగ్ని గుండంలో వేశాడు. అతని పది తలలలో తొమ్మిది ఆహుతి అయి, ఒక్కటి మిగిలింది. పదివేల సంవత్సరాలూ ముగిసి, రావణుడు తనకు మిగిలిన ఒక్క తలనూ నరుక్కోబోతుండగా, బ్రహ్మ దిక్పాలకులను వెంటబెట్టుకుని వచ్చి, "దశగ్రీవా, నీ తపస్సుకు మెచ్చాను. నీ కిష్టమైన వరం కోరుకో," అన్నాడు.

రావణుడు పరమానందంతో బ్రహ్మకు సాష్టాంగ నమస్కారం చేసి, "తాతా, ప్రాణులకు మరణభయాన్ని మించిన భయం మరొకటి లేదు కదా. నాకు ఎప్పటికీ చావు లేకుండా వరమియ్యి," అన్నాడు.

"నాయనా, అలాటి వరమియ్యటం సాధ్యం కాదు, మరొక వరం కోరుకో," అన్నాడు బ్రహ్మ.

"ఇతర ప్రాణుల భయం నా కేమీ లేదుగాని, నాకు సుపర్ణులూ, నాగులూ, యక్షులూ, దైత్యులూ, దానవులూ, రాక్షసులూ, దేవతలూ మొదలైన వారి వల్ల చావు లేకుండా వరమియ్యి. మనుష్యులు మొదలైన వాళ్ళు నాకు తృణప్రాయులే," అన్నాడు రావణుడు.

రావణుడు కోరినట్టే బ్రహ్మ వర మిచ్చాడు; ఆ వరంతో బాటు రావణుడికి పది తలలూ ఉండేటట్టూ, అతనికి కోరిన రూపం సిద్ధించేటట్టూ వరమిచ్చాడు.

తరవాత బ్రహ్మ విభీషణుణ్ణి కూడా వరం కోరుకోమన్నాడు. తన మనసు ధర్మం తప్పకుండానూ, తలచినప్పుడు తనకు బ్రహ్మాస్త్రం స్ఫురించేటట్టూ విభీషణుడు వరం కోరాడు. బ్రహ్మ అతనికి కోరిన వరమిస్తూ, చావు లేకుండా కూడా వరమిచ్చాడు.

తరవాత వరం పుచ్చుకునే వంతు కుంభకర్ణుడిది. దేవతలు బ్రహ్మతో, "దేవా, కుంభకర్ణుడికి వరమియ్యవద్దు. నందనవనంలో విహరిస్తున్న అప్సర స్త్రీలను ఏడుగురిని తినేశాడు. దేవేంద్రుడి అనుచరులను పదిమందిని తినేశాడు. ఎంతమంది ఋషులనూ, మునులనూ తిన్నాడో లెక్కే లేదు. వరాలు పొంద కుండానే వీడిలా ఉంటే, వరాలు పొంది ఎలా తయారవుతాడో!" అన్నారు.

ఈ మాటలు విని బ్రహ్మ సరస్వతిని స్మరించి, అక్కడికి రప్పించి, కుంభ కర్ణుడి వాక్స్థానాన్ని వశపరుచుకోమని చెప్పాడు. తరవాత ఆయన కుంభకర్ణుణ్ణి చూసి, "నీ కిష్టమైన వరం కోరు," అన్నాడు.

సరస్వతీ ప్రభావం చేత కుంభకర్ణుడు, "నాకు సంవత్సరాల తరబడి నిద్ర పోయేటట్టు వరమియ్యి," అన్నాడు. తథాస్తు అని చెప్పి బ్రహ్మ అదృశ్యు డయాడు.

కుంభకర్ణుడి వాక్కు నుంచి సరస్వతి కూడా దిగిపోయింది.

వెంటనే కుంభకర్ణుడికి స్పృహ వచ్చి నట్టయింది. "ఛీ, ఛీ! ఏమిటిలాటి వరం కోరాను? దేవత లేదో మాయ పన్ని నన్ను మోసగించారు," అని ఎంతో చింతించాడు.

రావణ కుంభకర్ణ విభీషణులు ఈ విధంగా బ్రహ్మవల్ల వరాలు పొంది, శ్లేష్మాతక వనానికి వెళ్ళి, అక్కడ నివసించసాగారు.



# వరనిర్ణయం

చలమయ్య అనే మధ్యతరగతి అసామీ, పెళ్ళీడుకొచ్చిన కూతురి వివాహ ప్రయత్నాలు చేస్తూ, ఎవరో చెప్పగా వీరవరం, రామవరం అనే గ్రామాలకు వెళ్ళాడు.

ఆయన అక్కడి నుంచి తిరిగి వచ్చి కూతురిని, "అమ్మా, వీరవరం కుర్రవాడు బాగానే వున్నాడు. కాని, అతడి బంధువర్గం చెడ్డదనీ, స్నేహబృందం మంచిదనీ తెలిసింది. ఇక, రామవరం కుర్రవాడి సంగతి అతడి బంధువులంతా మంచివాళ్ళే కాని, అతడి స్నేహితులు మాత్రం, అల్లరి చిల్లరి వెధవలు. వీళ్ళద్దరిలో, నువ్వు ఎవరిని చేసుకుంటావు?" అని అడిగాడు.

"వీరవరంసంబంధం ఖాయంచెయ్యి, నాన్నా," అన్నది కూతురు ఏ మాత్రం తడుముకోకుండా.

"ఆ రామవరం కాక, ఈ వీరవరంసంబంధం ఖాయం చెయ్యమని, ఎందుకంటున్నావు?" అన్నాడు చలమయ్య.

"నాన్నా, బంధువుల్ని దేవుడు నిర్ణయిస్తాడు. కాని, స్నేహితుల్ని ఎంచుకునే అవకాశం మన చేతుల్లోనే వున్నది. ఒకడికి వున్న మిత్రుల్నిబట్టి, వాడి వ్యక్తిత్వం ఎలాంటిదో ఇట్టే చెప్పవచ్చు," అన్నది కూతురు నవ్వుతూ.

—డా॥ తాటిచెర్ల గురురామప్రసాద్





# ధర్మన్న తెలివి

చంద్రాయపాలెంలో వుండే ధర్మన్నకు, ఒక గుర్రపుబండి వుండేది. దాపులనున్న పట్టణానికి వెళ్ళవలసిన పని వున్న గ్రామస్థులకు, అతడు బండిని బాడుగకు కట్టేవాడు.

ఒకనాడు ధర్మన్న ప్రయాణీకులను పట్టణంలో దించి, తిరిగి గ్రామానికి బయలుదేరాడు. అప్పుడు షావుకారు రంగయ్యకనిపించి, "ధర్మన్నా, ప్రయాణం మన గ్రామానికేనా ?" అని అడిగాడు.

అవునన్నాడు ధర్మన్న. రంగయ్య సంతోషంగా, చేతిలో వున్న సంచీని ముందు బండిలో పెట్టి, తర్వాత తాను ఎక్కి కూర్చుంటూ, "ఇక్కడ రావలసిన బాకీలు వసూలయేసరికి, సాయంకాలం అయిపోయింది. ఎక్కడైనా బాడుగబండి దొరుకుతుందేమో అని వెతుకుతూంటే, నువ్వు కనిపించావు." అన్నాడు.

బండి కదిలి కొద్ది దూరం వెళ్ళేసరికి, ఊరి పచారీకొట్టు చిదంబరంశెట్టి బండిని ఆపాడు.

"సమయానికి కంటబడ్డావు, ధర్మన్నా! సరుకులు కొని బండికోసం చూస్తున్నాను." అని చిదంబరంశెట్టి, నాలుగు గోతాం మూటలను బండిలో వేసి, రొండిన వున్న సంచీని తడుముకుంటూ బండి ఎక్కాడు.

గుర్రపుబండి పట్టణ పొలిమేరలు దాటేసరికి, మరి ఇద్దరు బండిని ఆపి, ఎక్కి కూర్చున్నారు. ఆ ఇద్దరూ చంద్రాయపాలెం వాళ్ళే. ఒకరు, ఆ ఊరి బడిపంతులు రామాచారి. ఆయన బట్టల దుకాణంలో పాతబాకీ చెల్లించడానికి వెళ్ళి, తీసుకుపోయిన డబ్బు చాలక పోతే, ఎవరో ఎరిగినవాళ్ళ దగ్గిర అప్పు చేసి, బాకీ చెల్లించి, ఇంటికి తిరిగి వస్తున్నాడట.

కోనే నాగవెంకటఆంజనేయులు

రెండోవాడు వ్యవసాయ కూలీ రాజన్న. వాడు పట్టణంలోని ఒక దుకాణంలో, ఏదో వస్తువు కుదువపెట్టి, ఇంటి అవసరాలకు గాను వందవరహాలు తీసుకుని, గ్రామానికి తిరిగి వస్తున్నాడు.

ఒకరికి నలుగురు తోడవడంతో, ప్రయాణం ఎంతో ఉల్లాసంగా సాగింది. సూర్యాస్తమయ వేళ గుర్రపుబండి గ్రామం చేరగానే, నలుగురూ బండి దిగి, సంతోషంగా ధర్మన్నకు చేరవలసిన బాడుగ డబ్బు లిచ్చి, ఎవరిదారినవాళ్ళు వెళ్ళిపోయారు.

ఆ మర్నాటి ఉదయం వేళ పట్టణం బయలుదేరడానికి, ధర్మన్న బండిని గుర్రానికి పూన్చుతుండగా, బండిలో తళతళ మెరుస్తూ కొన్ని వరహాలు అతనికి కనిపించినై. అతడు ఆశ్చర్యపోయి, వాటిని ఎంచి చూశాడు. మొత్తం ఎనభై వరహాలని లెక్క తేలింది.

ఆ వరహాలు క్రితం దినం తన బండి ఎక్కిన నలుగురిలో, ఒకరివైవుంటవని, ధర్మన్న ఊహించాడు. నీతిమంతుడైన అతను, ఆ డబ్బును తిరిగి సొంతదారుకు ఇవ్వాలని నిశ్చయించుకున్నాడు. అయితే, ఆ వరహాలు ఎవరివో తెలుసుకోవడం ఎట్లా? వెళ్ళి అడిగితే, ప్రతి ఒక్కరూ నావే అనవచ్చు.

ఏం చేయడమా అని తీవ్రంగా ఆలోచించసాగాడు ధర్మన్న. అలా ఆ రోజు గడిచి పోయింది. మర్నాటి ఉదయం, ఆ





డబ్బు నాదే ధర్మన్నా. ఎనభైవరహాలే కదా?'' అని అడిగాడు.

''అవును, బాబూ! నిక్కచ్చిగా ఎనభై!'' అన్నాడు ధర్మన్న.

అప్పుడు షావుకారు రంగయ్య డబ్బు మూట తీసుకుని, ''ఆ రోజు, నీ బండి ఎక్కినప్పుడు, నా చేతిలో బాకీ వసూళ్ళ డబ్బున్న సంచీ వున్నది, గదా! అది, ఒక మూల బాగా పిగిలిపోయింది. ఆ సంగతి, నేను అసలు గమనించలేదు. అది సరేకాని, ధర్మన్నా, ఆ డబ్బు, నాదే అని నువ్వెలా ఊహించావు?'' అని ప్రశ్నించాడు.

ధర్మన్న చిన్నగా నవ్వి, ''ఆ డబ్బు నిన్న ఉదయమే, నాకు బండిలో కనిపించింది. అందువల్ల, ఆ డబ్బు అంతకు ముందు సాయంకాలం పట్టణంలో, నా బండి ఎక్కిన, మీ నలుగురిలో ఒకరిదై వుంటుందని ఊహించాను. ఆ డబ్బు చిదంబరంశెట్టిగారిదై వుండేందుకు ఎంత మాత్రం అవకాశం లేదు. ఎందుకంటే, ఆయన డబ్బు విషయంలో ఎంత జాగ్రత్త పరుడో, మన అందరికీ బాగా తెలిసిన సంగతే! అంతే కాక, బండీలో వున్నంత సేపూ, ఆయన రొండిన వున్న డబ్బు మూటను, అదే పనిగా తడుముకుంటూనే వున్నాడు,'' అన్నాడు.

వరహాలను చిన్న మూటగా కట్టి, అతడు తిన్నగా షావుకారు రంగయ్య ఇంటికి వెళ్ళాడు.

రంగయ్య ఇంటి అరుగు మీద కూర్చుని వున్నాడు. ధర్మన్న ఆయన దగ్గిరకు పోయి నమస్కరించి, ''అయ్యా, నా బండిలో నిన్న కొన్ని వరహాలు దొరికినై. అన్నీ కలిపి మూటగా కట్టాను. అవి తమవే అయివుంటవని, నా అనుమానం!'' అంటూ డబ్బు మూటను ఆయనకు అందించాడు.

రంగయ్య మూట అందుకుని, అరుగు మీదే వుంచి, తాను లోపలికిపోయి పావు గంటలో తిరిగి వచ్చి, ''అవును, ఈ

''అవును, అది నేనూ గమనించాను,'' అన్నాడు షావుకారు రంగయ్య చిన్నగా నవ్వుతూ.

''ఇక ఆ ఎనభై వరహాల డబ్బు, వ్యవసాయకూలీ రాజన్నది కూడా అయేందుకు ఏ మాత్రం వీలులేదు. ఎందుకంటే అతను ఏదో వస్తువు కుదువపెట్టి తెచ్చిందే వందవరహాలు. ఒకవేళ, అందులో కొంత పోవడం అంటూ జరిగితే — ఇంటికి వెళ్ళగానే డబ్బు లెక్క చూసుకుని వుంటాడు గనక, తప్పక నా దగ్గరకు వెంటనే పరిగెత్తుకు వచ్చేవాడు,'' అన్నాడు ధర్మన్న.

''నిజం! సంగతి సందర్భాలు బాగా తర్కించావు,'' అన్నాడు షావుకారు రంగయ్య.

''పోతే, బడిపంతులు రామాచారి గారున్నారు. ఆయన బట్టల దుకాణం బాకీ చెల్లు వేయడానికి వెళ్ళి, డబ్బు చాలక, పట్టణంలో మరెవరో ఎరిగిన వారి దగ్గిర చేబదులు తీసుకున్నాడు. అలాంటాయన దగ్గిర ఎనభైవరహా లెలా వుంటాయి? ఇక మిగిలింది మీరు! పట్టణంలో లెక్కలు వేసి ఇవ్వవలసిన వాళ్ళ నుంచి లెక్కించి తీసుకున్న డబ్బును, ఇంటికి వచ్చాక మరొకసారి లెక్కపెట్టుకోవలసిన అవసరం, మీకుండదు. అందువల్ల, ఆ ఎనభై వరహాలూ మీవే అనుకున్నాను. పైగా, మీరు నన్ను చూడగానే ఆ మొత్తమెంతో అడక్కుండా, లోపలికిపోయి లెక్క సరిచూసుకున్న తరవాతే, బయిటికి వచ్చి నన్ను ఎనభై వరహాలు గదా, అని అడిగారు. ఇక, ఆ డబ్బు, మీదే అనడంలో సందేహమేమున్నది!'' అన్నాడు ధర్మన్న చిన్నగా నవ్వుతూ.

ధర్మన్న ఆలోచనాశక్తీ, నిజాయితీ చూసి ఎంతగానో సంతోషించిన రంగయ్య, అతడికి, ఆ ఎనభైవరహాల మూటా తిరిగి యిస్తూ, ''వద్దనక, తీసుకో ధర్మన్నా! ఇది, మనస్ఫూర్తిగా నేనిస్తున్న బహుమానం,'' అన్నాడు.





# భాగ్య దేవత

ఒక గ్రామంలో ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు. అన్న భాగ్యవంతుడు. తమ్ముడు దరిద్రుడు.

ఒక ఏడు అన్న పొలాలలో కోతలు పూర్తి అయాయి. ఆ పొలాలలో తమ్ముడు కాపలా కాస్తున్నాడు. అతను ఒక కుప్ప పక్కన కూర్చుని తన దీనస్థితిని గురించి ఆలోచిస్తూ ఉండగా, ఎక్కడి నుంచో ఒక స్త్రీ తెల్లబట్టలు కట్టుకుని, పొలమంతా తిరుగుతూ, రాలిన కంకులను ఏరి గడ్డికి అంటిస్తూ అతనికి కనిపించింది.

ఆమె సమీపంగా రాగానే, తమ్ముడు లేచి వెళ్ళి, ఆమె చెయ్యి పట్టుకుని, "ఎవరమ్మా నువూ? ఇక్కడ నీకేం పని?" అని అడిగాడు.

"నేను నీ అన్న భాగ్యదేవతను. రాలిపోయిన కంకులు వృథా పోకుండా గడ్డికి అంటిస్తున్నాను," అన్నదామె.

"అలాగా? అయితే మరి నా భాగ్య దేవత ఎక్కడ ఉన్నది?" అని తమ్ముడు ఆమెను అడిగాడు.

"ఆ కనిపించే దక్షిణపు కొండల అవతల ఉన్నది," అంటూ ఆమె అదృశ్య మైంది.

వెంటనే తమ్ముడు తన భాగ్యదేవత కోసం వెతుక్కుంటూ వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు. అతను తన గుడిసెకు వెళ్ళి, తనకున్న కొద్దిపాటి ఆస్తిని మూట గట్టుకుని బయలుదేరబోయాడు.

అంతలో పొయ్యి వెనక నుంచి దరిద్ర దేవత లేచి అతని వద్దకు వచ్చి, పెద్ద పెట్టున శోకాలు పెట్టి ఏడుస్తూ, "నన్నిక్కడ వదిలిపెట్టి పోతావా? నన్ను కూడా నీ వెంట తీసుకు వెళ్ళు." అన్నది.

చాలా దూరం వెళ్ళాలనీ, ఆమె అసలే అర్భకురాలనీ, నడవలేదనీ తమ్ముడు

బొహీమియా జానపదకథ

చెప్పి చూశాడు గాని, లాభం లేక పోయింది.

చివరకు అతను, "సరే, అలాగే తీసుకుపోతాను. ఈ సీసాలో ప్రవేశించు. నా వస్తువులతోపాటు నిన్ను కూడా పట్టుకు పోతాను," అన్నాడు.

దరిద్రదేవత చిన్నదైపోయి సీసాలో ప్రవేశించింది. తమ్ముడు ఆ సీసాకు గట్టిగా బిరడా బిగించి, ఇంటి నుంచి బయలు దేరాడు. దారిలో అతనికి ఒకచోట ఊబి తగిలింది. దరిద్రదేవత ఉన్న సీసాను అతను ఆ ఊబిలో లోతుగా కూరి, దరిద్ర దేవతను వదిలించుకుని, ప్రయాణం సాగించాడు.



అతను దక్షిణపు కొండలను దాటి ఒక పట్టణం చేరుకున్నాడు. అక్కడ ఒక పెద్ద మనిషి తమ్ముడికి పని ఇవ్వటానికి ఒప్పు కున్నాడు.

"నాకు నేలమాళిగ ఒకటి తవ్వి పెట్టాలి. నీకు నేను జీతం ఏమీ ఇయ్యను. కాని తవ్వేటప్పుడు నీకు ఏ నిధి నిక్షేపాలు దొరి కినా అవి నీవే," అన్నాడు ఆ పెద్దమనిషి.

తమ్ముడు అందుకు ఒప్పుకుని నేల మాళిగ తవ్వనారంభించాడు. ఒక గంట సేపైనా తవ్వాడో లేదో అతనికి కొంత బంగారం దొరికింది. పెద్దమనిషి ఆ బంగారం తనదే అని చెప్పినప్పటికీ, తమ్ముడు అందులో సగం ఆ పెద్దమనిషికి ఇచ్చేశాడు.

ఇంకా తవ్వుతూపోగా, నేల అడుగున ఒక కొట్టం లాటిది బయటపడింది. దానిలో బంగారు నాణాలూ, మణులూ కుప్పలు పోసి ఉన్నాయి. వాటితోబాటు ఒక పెద్ద పెట్టె కూడా ఉన్నది. అందులో నుంచి ఎవరో, "పెట్టె తెరు! పెట్టె తెరు!" అని అరవటం అతనికి వినిపించింది.

తమ్ముడు పెట్టె మూత పైకెత్తాడు. అందులో నుంచి ఒక స్త్రీ పైకి వచ్చింది. ఆమె కూడా తెల్లబట్టలు ధరించి ఉన్నది.

"నువు ఎవరు?" అని తమ్ముడు ఆమెను అడిగాడు.

"నేను నీ భాగ్యదేవతను. నాకోసమే కద నువు వెతుకుతున్నావు? ఇక నుంచీ నేను నిన్నూ, నీ కుటుంబాన్నీ వదల కుండా కనిపెట్టుకుని ఉంటాను," అన్నది ఆమె. వెంటనే ఆమె అదృశ్యమయింది.

నేల అడుగున దొరికిన నిధిని తమ్ముడు పెద్దమనిషికి చూపించి, అతడితో సమంగా పంచుకున్నాడు.

ఇప్పుడు తమ్ముడు కోటీశ్వరుడైనాడు. కాని అతను తాను పూర్వం అనుభవించిన దారిద్ర్యాన్ని మరిచిపోక, తన గ్రామానికి తిరిగి వచ్చినాక, కనిపించిన దరిద్రుల కందరికీ సహాయపడుతూ రాసాగాడు.

ఒకనాడు అన్నదమ్ము లిద్దరూ వీధిలో కలుసుకున్నారు. తమ్ముడు అన్నను తన ఇంటికి తీసుకు వచ్చి, జరిగినదంతా చెప్పాడు. అతను తన అన్నను చాలా రోజులు తన ఇంటనే ఉంచుకుని విందులు కుడిపి, వెళ్ళిపోయేటప్పుడు అతనికీ, అతని భార్యకూ, పిల్లలకూ విలువ గల కానుకలు ఇచ్చి పంపేశాడు.

తమ్ముడి ఐశ్వర్యం చూసి అన్న సహించలేక అసూయపడ్డాడు. దరిద్రదేవతను తిరిగి తమ్ముడి మీదికి పంపకం చెయ్యాలని అతనికి దుర్బుద్ధి పుట్టింది.

అన్న తన తమ్ముడు చెప్పిన ఊబి వద్దకు వెళ్ళి, తమ్ముడు పాతి పెట్టిన సీసాను పైకి తీసి, బిరడా తెరిచాడు.

మరుక్షణమే సీసా నుంచి దరిద్రదేవత పైకివచ్చి, అన్నను వాటేసుకుని, "నాకు ఈ మేలు చేసినందుకు నిన్ను ఎన్నటికీ విడిచి పెట్టను. బతికి ఉన్నంత కాలమూ నీ వెంటనే ఉంటాను," అన్నది.

అన్న ఆమెను తిరిగి పాతి పెట్టాలని చూశాడు. నదిలో ముంచుదామను కున్నాడు. కాని అతని ప్రయత్నాలేవీ కొనసాగలేదు. దారిలో అతన్ని దొంగలు దోచి, తమ్ముడిచ్చిన కానుకలు కాజేశారు. అతను ఇంటికి చేరేసరికి అతని ఇల్లూ, గాదెలూ, వాములూ తగలబడిపోయి ఉన్నాయి. అతని పొలాలలో పంట వరద వచ్చి కొట్టుకుపోయింది.






మహాంచాలవరం అనే గ్రామంలో పాపడు అని ఒక తోటకాపు ఉండేవాడు. పాపడు ఏపైన కూరలు పెంచటంలో ఎంతో ప్రవీణుడు. వాడు తనకున్న కొద్దిపాటి భూమిలోనే చక్కగా ఎరువులు తోలి, మడులు వేసి, కాయగూరలు పండించి వాటిని మంచి ధరకు అమ్మి, వచ్చిన డబ్బుతో తృప్తిపడి కాలక్షేపం చేస్తూండే వాడు. తాను పెంచే కాయగూరల మీద వాడి కెంత ప్రేమంటే, తనకు నచ్చిన పెద్ద పెద్ద గుమ్మడికాయలు మొదలైన వాటికి వాడు ముద్దుపేర్లు కూడా పెట్టుకునేవాడు.

ఆ గ్రామంలోనే గవరన్న అని మరొక తోటకాపు ఉండేవాడు. పాపడి పొలం కంటె గవరన్న పొలం పెద్దది కూడాను. అయినా గవరన్నకు ఎంతసేపూ డబ్బు సంపాదించాలన్న దుగ్ధే తప్ప, కూరలు పెంచటంలో కొంచెమైనా తెలివితేటలు గాని, ఓపిక గాని లేదు. అందువల్ల పాపడి కూరలకు వచ్చే ధర గవరన్నకు ఏనాడూ పలికేది కాదు.

"నువు శాస్త్ర చదువుకున్నవాడివి. ఆ పాపన్నకు ఏ చదువూ లేదు. కాని నువు వాడితో సమంగా కాయలు పండించ లేవు!" అని గవరన్నను అందరూ ఎద్దేవా చేసేవారు.

ఒక ఏడు పాపడు అత్యద్భుతమైన మంచి గుమ్మడికాయలు పండించాడు. అంత పెద్ద గుమ్మళ్ళను ఎవరూ ఎన్నడూ చూసి ఉండలేదు. వాటిని చూసిన పాపడి ఆనందానికి మేర లేదు. ఎంతో ప్రేమతో, వాడా కాయలకు 'ఐరావతం,' 'పానకం బిందె,' 'మహలక్ష్మి,' 'పెద్దక్క,' 'బంగారం,' అని రకరకాలుగా పేర్లు పెట్టుకున్నాడు. ఆ యేడు ఇటువంటి

పెద్ద కాయలు నలభై దాకా పాపడి పాదు లకు కాసాయి.

రేపు సంత అనగా పాపడు తన తోటకు వెళ్ళి, ఏయే గుమ్మడికాయలను కోసి తీసుకుపోవాలో గుర్తు పెట్టుకుని, తెల్లవారు తూనే బండితోసహా రాపటానికినిర్ణయించు కుని ఇంటికి వెళ్ళాడు. ఆ రాత్రి పాపడికి నిద్ర పట్టలేదు. ఆ కాయలను తన చేతి మీదుగా సంతలో అమ్మటమంటే, అను రాగంతో కనిపెంచిన కూతుళ్ళను అత్త వారిళ్లకు పంపటమే అనిపించింది వాడికి.

మర్నాడు తెల్లవారుతూనే లేచి బండి కట్టుకుని పాపడు తోటకు వెళ్ళాడు. గుమ్మడి పాదుల మధ్యకు వెళ్ళేటప్పటికి పాపడి గుండె గుబుక్కుమన్నది. పెద్ద గుమ్మడికాయ లన్నిటినీ ఎవరో కోసుకు పోయారు! పాపడికి మతి పోయినట్ట యింది. పిచ్చివాడల్లే పాదుల మధ్య చాలాసేపు తిరిగాడు. తన గుమ్మడి కాయలను కాజేసిన వాళ్ళను తిట్టు కున్నాడు.

అంతలో పాపడికొక ఆలోచనవచ్చింది. ఒకటీ, రెండూ కాదు — నలభై గుమ్మడి కాయలు! ఎక్కడికి పోగలవు? పోతే సంతకే పోవాలి. వాటిని తను ఎక్క డున్నా గుర్తు పట్టగలడు!

వెంటనే పాపడు బండీ ఎక్కి, సంతకు బయలుదేరాడు. ఒక గంటలో అక్కడికి చేరి కాయగూరల దుకాణాలన్నీ చూడ సాగాడు. ఒక దుకాణంలో వాడికి తన



గుమ్మడికాయలన్నీ ఒక్క కుప్పలో కని పించాయి. పాపడు చప్పున దుకాణం వాడి దగ్గిరికి పోయి, "ఇదేం పని? దొంగ పని! నా గుమ్మళ్లు దొంగతనంగా కాజేసి నీ కొట్లో అమ్మకానికి పెడతావా?" అన్నాడు కోపంగా.

ఆ మాటలకు దుకాణం వాడు నిర్ఘాంత పోయి, "ఇవి నేను దొంగతనం చెయ్య లేదు. మీ వూరి గవరన్న ఈ పూటే నా కివి అమ్మి పది రూపాయలు పట్టు కెళ్ళాడు," అన్నాడు.

"గవరన్న ఇంకా తిరిగి పోలేదు. అవతల ఇంకో అంగడిలో ఉన్నాడు," అని పక్కనున్న వాళ్ళెవరో పాపడికి చెప్పారు.

పాపడు వెంటనే సంతలో ఉండే అధి కారి దగ్గిరికి వెళ్ళి, గవరన్న తన గుమ్మడి కాయలు తెచ్చి సంతలో అమ్మేశాడని ఫిర్యాదు చేశాడు. గవరన్నను నలుగురూ కలిసి దుకాణానికి తెచ్చారు.

"ఈ గుమ్మడికాయలు నీవేనని నీకెట్లా తెలుసు?" అని అధికారి పాపడి నడిగాడు.

"నాకు తెలీకపోవటమేమిటి? నే పెంచినవేగా? ఇదుగో మహాలక్ష్మి! ఇదుగో ఐరావతం!" అంటూ ఒక్కొక్క కాయనే పాపడు చూపసాగాడు.

చుట్టూ చేరినవాళ్ళంతా పాపడి అమాయకత్వానికి నవ్వారు. అధికారి కూడా నవ్వుతూ, "అది కాదోయ్, ఈ కాయలను నువు గుర్తించటం కాదు, ఇవి



నీవేనని ఇతరులు గుర్తించే సాక్ష్యం ఏదన్నా ఉండాలి,'' అన్నాడు.

పాపడికి ఏమీ పాలుపోలేదు.

అధికారి గవరన్న కేసి తిరిగి, ''ఏమోయ్, ఈ గుమ్మడికాయలు నువు దొంగిలించావని పాపన్న అంటున్నాడే? ఏమంటావు?'' అని అడిగాడు.

''వాడు అమాయకుడు లెండి. నేను పండించే కూరల లెక్కలూ, వాటి అమ్మకం లెక్కలూ వివరంగా రాసిన పద్దుల పుస్తకం ఇంటి దగ్గిర ఉన్నది. కావలిస్తే ఇప్పుడు పోయి తీసుకు రాగలను,'' అని గవరన్న చెప్పాడు.

ఈ మాట వినగానే పాపడు, ''అయ్యా, ఇవి నా కాయలే అని చూపటానికి నా దగ్గిరా గొప్ప పద్దుపుస్తకం ఉంది. నేనూ తెస్తా!'' అన్నాడు.

ఈ మాట విని గవరన్న విరగబడి నవ్వాడు.

అధికారి భటులను వెంట యిచ్చి ఇద్దరినీ వాళ్ళ గ్రామానికి పంపాడు. కొంతసేపటికి ఇద్దరూ తిరిగి వచ్చారు. గవరన్న తన పద్దుపుస్తకం తెచ్చాడు. పాపడు తన పైబట్ట కొంగున ఏవో మూట కట్టి తెచ్చాడు.

గవరన్న పద్దుపుస్తకంలో తాను ఆ రోజే నలభై గుమ్మడికాయలు తన తోట నుంచి కోసి సంతకు పట్టుకెళ్ళినట్టు పద్దున్నది.

''నీ పద్దు మాటేమిటి?'' అని అధికారి పాపడి నడిగాడు.

పాపడు మూట విప్పి నలభై గుమ్మడి తొడిమలు తీసి, ''అయ్యా, ఇదుగో నా పద్దు!'' అన్నాడు. వాడు ఒక్కొక్క తొడిమే తీసి, ఒక్కొక్క గుమ్మడికాయకు తగిలించి, అన్ని తొడిమలూ అన్ని కాయలకూ ఎంత బాగా అతికాయో చూపాడు.

వెంటనే అధికారి గవరన్నచేత పాపడికి గుమ్మడికాయల డబ్బు ఇప్పించేశాడు. ఆనాటి నుంచీ, వాళ్ళ గ్రామంలో గవరన్నను అందరూ, ''గుమ్మడికాయల దొంగ!'' అని పిలవసాగారు.






## త్రవ్వకం!

ఒక్క రాత్రిలో 70 గజాల పొడవు సొరంగం త్రవ్వగల శక్తి అడవి ఎలుకకు ఉన్నది!



## అతి నిదానంగా పూచే మొక్క

ప్రపంచంలో కెల్లా అతి నిదానంగా పూచె పూయారాయ్‌మోండీ అనే అరుదయిన మొక్క బొల్వియాలో ఉన్నది. ఎనిమిదడుగుల అడ్డు కొలతలో 35 అడుగుల ఎత్తు ఎదిగే ఈ మొక్క నూటయాభై సంవత్సరాల తరవాత పూస్తుంది. ఆ తరవాత చచ్చిపోతుంది.



## ఎగిరే పాము

ఆసియాలో కనిపించే ఎగిరే పాము—చుట్టగా చుట్టుకుపోయి, ఒక్క ఊపులో గాలిలోకి ఎగిరి, ఒక్కసారికి మీటరు దూరం దాటగలదు!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



V. Rajamani

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పెదవి దాటిన రహస్యం

రెండవ ఫోటో : పరిధి దాటితే ప్రమాదం

పంపినవారు : డి. ప్రవీణ్‌కుమార్‌రెడ్డి, తిరుపతి–517501. (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

"ముఖంపై మొట్టమొదటి మొటిమ వచ్చిందని కనుక్కున్న రోజు.
అదే నేను క్లియరసిల్‌ని కనుక్కున్న రోజు"



నాకింకా బాగా గుర్తుంది ఆ రోజు. నేను ఉత్సాహంతో గంతులువేస్తున్న రోజు....అక్కయ్య పెళ్ళి యింకా సరిగ్గా వారం రోజులుందేమో. కొత్త బట్టలు ముచ్చటగా వేసుకుంటూ అద్దం ముందు నిలబడ్డా–చటుక్కున గాబరాపడ్డా....నా బుగ్గ మీద ఏదో వచ్చిందని చూసుకుని....మొటిమ. నా ముఖంపై వచ్చిన మొట్టమొదటి మొటిమ. నేననుకున్నా చటుక్కున....నా కేమిటి, యిదేమిటి, యిప్పుడే రావాలేమిటి అని!

అప్పుడే వచ్చింది అక్కయ్య అక్కడికి. చూసింది నా వాలకం–"పిచ్చి పిల్లా, యీ మాత్రం తెలియదా. యీ వయసులో అందరికీ వస్తాయి గదా మొటిమలు. నాకూ వచ్చాయి. వాడేను నేనప్పుడు క్లియరసిల్. వాడాలి నువ్వూ మరి. ఏం?" వాడేను నేనూ మరందుకే. ఏమైందో తెలుసా? పనిచేసిందది!....ఇక ఆ ఉషారులో పెళ్ళి పందిట్లో ఎంత చలాకీగా తిరిగానో ఏం చెప్పమంటారు.



**క్లియరసిల్, మొటిమల్ని పోగొడుతుంది, దాంతో బాటే వాటిని పాకకుండా చేస్తుంది.**




OBM/5687/TL

# క్లియరసిల్

మొటిమల్ని పోగొట్టేందుకు ప్రత్యేకమైన చికిత్స–ఎక్కువ ప్రభావంతో పని చేసేది.